# ప్రణయరోగులు

[‘కైవల్య’కు తెలుగు]

కె. రి హా న్

యువ బుక్ డిపో
ఆచారప్పన్ వీధి :: గవర్నరుపేట
మద్రాసు :: బెజవాడ

# రెండు మాటలు

ఈ నాటకంలోని పాత్రలకు తెలుగుపేర్లు పెట్టటంలో ఉద్దేశం ఇది తెలుగునాటకమనే అభిప్రాయం కలగజేయటంకాదు. షెరిడాన్ తనపాత్రలకు సార్థకనామా లుంచాడు. అటువంటిపేర్లను యథాతథంగా తీసుకొనటంవల్ల ప్రయోజనంలేదు. కొన్నిపాత్రలకు సార్థకనామాలుంచి మరికొన్నిపాత్రలకు మాతృకలోని పేర్లేఉంచితే అతకదనే ఉద్దేశంతో అన్నిపాత్రలకూ తెలుగుపేర్లే ఉంచటమైంది.

షెరిడాన్ సుప్రసిద్ధ నాటకరచయిత. షేక్స్పియరు తరువాత షెరిడానేఅన్న విమర్శకు లున్నారు. నాటకశిల్పం అభివృద్ధిచేసుకోదలిచినవారి కిటువంటి నాటకాలు విశేషంగా ఉపయోగించవచ్చు. ఈ తర్జుమా తెలుగురంగస్థలాని కెంతవరకు ఉపకరిస్తుందనేది తెలుగుదేశంలోని నాటకసమాజాల వారికి వదిలివేస్తున్నాను.

# పాత్రలు :

కాప్టెను విశ్వం [illegible]

అనుమానశాస్త్రి — [illegible]

పిచ్చిబాబు — [illegible]

కయ్యంపంతులు — Sir L. O'Trigger

చుట్టయ్య — Fag

సూరన్న — David

బండివాడు — Coachman

తికమకమ్మ Malaprop

రజని — Julia

నళిని — Lydia

లక్ష్మి — Lucy

[illegible] — Sir Anthony Absolute

[illegible]

# ఒకటో అంకం

## ఒకటో రంగం : ఆరోగ్యపురవీథి

[బండివాడు వీథివెంట పోతూవుంటే అతన్ని వెన్నంటి చుట్టయ్య]

చుట్టయ్య:-ఇదుగో !—అప్పన్నా !—వాడేనా ?—ఇదుగో !—— అప్పన్నా ! అప్పన్నా !

బండివాడు:-ఏంటిదీ ?——చుట్టయ్యే ?

చుట్టయ్య:-అవునోయ్ ? ఎప్పుడొచ్చావ్ ? ఏమిటి కథ ?

బండివాడు:-పంతులుగారూ, రజనెమ్మగారూ, నౌకర్లూ, అందరం బయలెల్లి వొచ్చేశాం.

చుట్టయ్య:-నిజంగానే ?

బండివాడు:-కాక ? పంతులుగారికి కాళ్ళట్టుకుపోతాయని బయమేయట మేంటి పిల్లా మేకా అంతా బయలెళ్ళి రావటమేంటి అంతా చనంలో అయిపోయింది.

చుట్టయ్య:- ఆలోచన తగిల్నాక ముందూ వెనకా చూస్తే నిరంకుశం పంతులుగారే కాదూ !

బండివాడు:-అవునుగాని, సుట్టయ్యమామా, అద్బాయిగారెట్టాఉన్నారు? అద్బాయిగారిక్కడున్నట్టు పంతులుగారికి తెలిస్తే ఎంతయినా విచిత్ర పడతారు.

చుట్టయ్య:-నే నిప్పుడు కాప్టెన్ విశ్వంగారి కొలువులో లేనే !

బండివాడు:-సరి ?

చుట్టయ్య:-ఇప్పుడు నా ఉద్యోగం సిపాయి శృంగారంగారి దగ్గిర.

బండివాడు:-అయ్యో, ఎందుకు నౌకరీ మార్చుకున్నావు, మామా !

చుట్టయ్య:-ఉద్యోగం ఎక్కడ మారింది, అప్పన్నా ?

బండివాడు-అద్బాయిగారి కొలువు మానుకున్నానంటివి గాదుటయ్యా?

చుట్టయ్య:-లేదే, సరే నన్నింక ఏడిపించటందేని కప్పన్నా ! రహస్యం చెప్పేస్తా విను. కాప్టెను విశ్వంగారే సిపాయి శృంగారంగారు.

బండివాడు:-ఏందేందీ ?

చుట్టయ్య:-మరేమిటనుకున్నావప్పన్నా ? ఇప్పుడు సన్మాజ్ఞాపించేది సిపాయిగారు గనక కాప్టెనుగారి ఊసేలేదు.

బండివాడు:-బా-గుంది ! అయితే, మామా, ఇందులో ఏందో కిటుకుం డాల్సిందేనే ? చెప్పు, మామా, మనిద్దరి మద్దెనీ రహస్యాలేందిలెస్తూ !

చుట్టయ్య:-మళ్ళా ఎక్కడన్నా అనేవుసుమా !

బండి:-ఇనప్పెట్టే అనుకో !

చుట్టయ్య:-దీనికంతా మూలకారణం ఆడది, అప్పన్నా! ఇంద్రుడి కాణ్ణించీ చూసుకో, మగాడు మారేషం కట్టాడంటే ఆడదాని కోసమే.

బండివాడు:-ఆడదా నోసన నా కప్పుడే కొట్టిందిలే. అయితేమిట్టుకు మారేసమేసుకునే అబ్బాయిగారు ఏదర్జాహోదా అయినా పెట్టుకోక సిపాయి యోసంకట్టట వేందయ్యా ?

చుట్టయ్య:-అక్కడే ఉంది కిటుకంతా. అబ్బాయిగారు ప్రేమించిన ఈ ఆడగూతు రదో రకం మనిషి. ఈయనగారు డబ్బులేని సిపాయిసన్న బట్టే ఈనగారి మొహంచూస్తున్నది గాని సాలుకు నలభై వేలొచ్చే విరంకుశం పంతులుగారి కొడుకంటే చూస్తదనుకున్నావా ? వొట్టిమాట.

బండివాడు:-ఇదేంమడిసబ్బా ? పోనీ ఈవిడగారి దగ్గిరేమైనా ఇంత లప్ప ఉండదా ?

చుట్టయ్య:-లప్పా, అప్పన్నా ? అడగమాకు. లక్షలకు లక్షలుంది. పెంపుడు కుక్కకి బంగారప్పళ్ళెంలో తిండిపెడుతుందంటే నమ్ము. పెంపుడు చిలక్కి మంచి ముత్యాలు మేపుతుంది. వందరూపాయల నోట్లుపెట్టి నెయ్యి కరగబెడుతుందనుకో !

బండి:-ఓ లబ్బో ! అయితే ఆయిడగారి దగ్గిర యేలకు యేలుండ వనుకోవాల్సిందే. మరిఅబ్బాయిగారంటే ఏమైనా అభిమానంగా ఉంటందా ?

చుట్టయ్య:-గువ్వల జంటనుకో!

బండివాడు:-ఆయిడగారి పేరేందబ్బా?

చుట్టయ్య:-నళినమ్మ. కాని ఈయమ్మ మేనత్తుంది, పానకంలో పుడక లాగా. అయితే గుడ్డిలోమెల్లేమంటే ఈ ముసిలిదయ్యం ఇంకా అబ్బాయి గార్ని చూడలా. అసలబ్బాయిగారికీ ఈ అమ్మాయిగారికీ స్నేహం కావటం ఇక్కడగాదు, ఏటవతల.

బండివాడు:-ఏమో, పాపం. ఇద్దరికీ మూడుముళ్ళూపడితే తీరిపోద్ది.... అయితే, మామా, ఈ ఆరోగ్యపురం ఎటువంటి ఊరంటావ్? మాలావు సంబరంగా ఉంటదంటగా, నిజమేనా?

చుట్టయ్య:-ఏమంత పరవాలేదప్పన్నా, మంచి విశ్రాంతిఅయిన ఊరే. పొద్దుటిపూట ఇంత జలతాగటమూ, కాఫీ అయినాక మైదానాల మీద షికారుచెయ్యటమూ, లేకపోతే ఏదైనా ఆడుకోవటమూ. రాత్రిళ్ళ సంగీతాలు అవీఉంటై. కాని నాకు చెడ్డవిసుగ్గా ఉంది చెప్పొద్దూ. రాత్రి పది కొట్టిందంటే ఈవూరివాళ్ళు నిద్రకుపడతారు. ఓ పేకాటలేదు, ఓ చుక్క వేసుకోవటంలేదు. అయితే ఏంలే. జగ్గన్నా నేనూ కలిసి కాస్త జల్సా చేస్తూనే ఉన్నాం. జగ్గన్నను చూశావంటే వొదలవు.

బండివాడు:-జగ్గన్నను నే నెరగనా ఏం? మారజనెమ్మగార్ని పెళ్ళాడే పెద్దపడిసి నౌకరేగా?....అదుగదుగో, మీ అబ్బాయిగారు! ఆయనతో మాట్టాడే పడిసేనా నువు చెప్పిన ఆడగూతురు?

చుట్టయ్య:-కాదు, కాదు. ఈ మనిషి ఆయమ్మగారికి పనిమనిషి, లక్ష్మి. నేను పోయి అబ్బాయిగారితో అంతా చెప్పేయ్యాలి.

బండివాడు:-అరి! ఆయమ్మికి బాబుగారు దబ్బుకూడా ఇస్తాఉండారే? ....ఏం- మామా?

చుట్టయ్య:-నే వెళ్ళాలప్పన్నా. రాత్రి ఎనిమిదింటికి జగ్గన్న దగ్గిరికిరా. జల్సాచేసుకుందాం.

[ఎవరిదారిన వారు పోతారు.]

## రెండో రంగం : తికమకమ్మగారిల్లు

[నళిని సోఫాలో కూర్చుని ఉంటుంది. అప్పుడే తిరిగివచ్చిన లక్ష్మి చేతిలో ఒక పుస్తకం పట్టుకుని ఉంటుంది.]

లక్ష్మి:-నీ తోడమ్మా, అన్ని లైబరరీలూ వెతికాను.

నళిని:-అంతటా వెతికినా నీకు "ప్రేమ పర్యవసానం" దొరకనే లేదుటే ?

లక్ష్మి:-లేదమ్మా.

నళిని:-పోనీ "పశ్చాత్తాప ?"

లక్ష్మి:-లేదమ్మా.

నళిని:-"హృదయవేదన ?"

లక్ష్మి:-ఇంతకుముందే ఎవరో ఎత్తుకెళ్ళారంట.

నళిని:-అరెరే ! అయితే "విరహబాధ"కోసం అడిగావా ?

లక్ష్మి:-అదీలేదు. "రతీదేవి అనుభవాలూ" లేదు. సత్తెప్రేమానకంగా నమ్మా. ఎక్కడాలేదు. బగవాన్లుగారిదగ్గిర ఓపుస్తకం ఉందిగాని అది పట్టికెళ్ళిన మీనాచ్చమ్మగారు ఏకాయితాని కాకాయితం ఊడదీసి మాపి పంపిందంట.

నళిని:-మీనాక్షి కెప్పుడూఉన్న తెగులేలే. అయితే ఇంతకూ నువు తెచ్చిందేమిటే ?

లక్ష్మి:-(చీరె చెరగులోనుంచి పుస్తకాలుతీస్తూ) ఈగోనమ్మా ! "పీడ విముడి", "శంకరంగారి శంకలు", "అశ్రుతర్పణ" "పతితురాలి స్వీయ చరిత్ర", "ప్రణయప్రయాణం"

నళిని:-ఆపెద్దపుస్తకం ఏమిటే ?

లక్ష్మి:-అదేం లేదమ్మా, "మానవధర్మం" రిబ్బన్లు పెట్టుకునేందుకు.

నళిని:-ఉండవే! ఎవరో వొస్తున్నట్టుంది. పోయిచూడూ, రజనిగాంతే.

[లక్ష్మి పోతుంది.]

లక్ష్మి:-[వచ్చి] రజనెమ్మగా రొచ్చారండీ.

నళిని:-నిజంగానే? రజని వస్తుంది.

రజని:-అవును. అప్పుడే మరింత ఆనందంగా ఉంటుంది. అది సరే కాని నిన్నిక్కడ జైల్లో ఉంచినట్టు కనిపిస్తుందేం?

నళిని:-నీకు లక్షవిషయాలు చెప్పాలే. ముందు నువ్విక్కడి కెట్లా వచ్చావో చెప్పు. నిరంకుశంపంతులుగారుకూడా వచ్చారా?

రజని:-ఆ. మేమంతా దిగి ఇంకా గంటకూడా కాలేదు. ఇం కొంచెం సేపట్లో ఆయన తికమకమ్మగార్ని చూట్టానికి వస్తారనుకుంటా.

నళిని:-అయితే చప్పున నాగొడవంతా చెప్పేస్తా. నాకథవిని నువు కోప్పడ్డా పరవాలేదు, స్నేహితురాలివి గనక. శృంగారంగార్నిగురించి నీకు రాశానుగదూ? అయన్ని కాస్తా పోగొట్టుకున్నాను, రజనీ. మా అత్త కీఆచోకీయూవస్తూ తెలిసిపోయింది. ఒక ఉత్తరం కాస్తా ఆవిడచేతిలో పడింది. నన్నీకొంపలో ఖైదుచేసి ఉంచింది. ఇంతాచేసి ఆవిడచేసిన ఘనకార్యం విన్నావా? ఒకరింటికి విందుకు వెళ్ళి అక్కడ కయ్యం పంతులనే పెద్దమనిషిని చూసి ఈవిడగారి కాయనగారిమీద మోహం పుట్టుకొచ్చి తపించి చస్తున్నది.

రజని:-ఏం మాటలే, నళినీ!

నళిని:-నీతోడే! చాత్రకి అనోంలన అనోమూరు పేరుపెట్టుకుని ఉత్తరాలు రాస్తుందే!

రజని:-అయితే నీమీద కాస్త సానుభూతి కలగొచ్చుగా?

నళిని:-అదే చిత్రం. ఆవిడ కీ రోగంపుట్టినప్పట్నుంచీ నామీది అనుమానం రెట్టింపయింది. ఇది చాలక నా కింకో పీడకూడా దాపరించ బోతున్నది. ఆపిచ్చివెధవడాబుకూడా ఇవాళ ఇక్కడికి దిగుతాట్ట. ఇక నాబాధలు భగవంతుడికే తెలియాలి.

రజని:-ఎందుకే అంత విసుగూ? నిరంకుశంపంతులుగారు మీ అత్తను కోప్పడతార్లే.

నళిని:-సరేలే! నీకసలు సంగతి తెలీనే తెలీదన్నమాట! నాగుట్టు మా అత్తకి తెలిసిపోతుందనగా నేను కాస్తా నా శృంగారంగారితో పోట్లాడాను. మళ్ళీ మాకు సంధిజరిగేలోపుగా నే నిక్కడ ఇరికిపోయినాను.

రజని:-ఆయన ఏం తప్పుచేశాడో!

నళిని:-ఏమీలేదే! మేమిద్దరమూ ఎన్నడూ ఒక్కసారికూడా కీచులాడుకోలేదు. కీచులాడుకునే అవకాశం నాకు రానేరాదేమోనని భయం వేసింది. అందుకని మొన్న గురువారం నా దేంచేశానంటే మారుపేరుతో నాకు నేనే ఒక ఉత్తరం రాసుకున్నాను. శృంగారంగారు మరో ఆవదాని కోసం పారాడుతున్నాడని అందులో రాసి, అది కాస్తా శృంగారంగారి మొహం ఎదటపెట్టాను. ఇటువంటిపనులు చేస్తున్నందుకు నీమొహం ఎప్పటికీ చూడనని ఘోరమైన ఒట్టుపెట్టుకుని, చచ్చేటంత ఆగ్రహం తెచ్చుకుని వచ్చేశాను.

రజని:-ఆయన్ని ఆస్థితిలో వదిలేసివచ్చి మళ్ళీ చూడనే లేదన్నమాట?

నళిని:-మర్నాడే మా అత్తయ్యకి ఆయన ఉత్తరం దొరికిపోయిందిగా, ఆయన్ని మూడున్నరరోజు లేడిపిద్దామనుకున్నాను. కాని ఖర్మం, ఇక ఆయన్ని కలుసుకునే గీతేలేకుండా పోయింది.

రజని:-ఆయన నువు చెప్పినంత మంచివాడయితే ఇంతమాత్రానికే నిన్ను వొదిలేసి వెళ్ళడులే. కాని చూడు, నళినీ, అతనికి మామూలు సిపాయి ఉద్యోగమనిగదా చెప్పావు, నీకు నాలుగులక్షల ఆస్తిఉందిగదా-

నళిని:-నాకు మైనారిటీ వెళ్ళేలోపుగా మా అత్తయ్య అనుమతిలేకుండా పెళ్ళాడితే నాకా ఆస్తి రాదుగా, అది తెలిసినప్పట్నుంచీ ఆవిడ ఇష్టం లేకుండా పెళ్ళాడాలని తహతహ లాడిపోతున్నానే. అందు కొప్పుకోనివాణ్ణి నేను పెళ్ళాడుతానా ఏం?

రజని:-ఎబ్బే, ఇదంతా వొట్టి చపలచిత్తం:

నళిని:-నువుకూడా చపలచిత్తమని ఒకర్నింకా తప్పుపడుతున్నావా?

అనుమానంగార్ని పెళ్ళాడబొయ్యేదానికి చపలచిత్తం సహించటం అలవాటయి ఉండాలే!

రజని:-ఆయన చపలచిత్తంపటుకు సహిస్తా ననుకున్నావా ఏం?

నళిని:-అన్నట్టాయనకు తెలియజేశావా నువ్విక్కడికి వచ్చిన సంగతి?

రజని:-వ్యవధి ఏదీ? నిరంకుశంగారు మమ్మల్ని ఉన్నపాట్న బయల్దేర దీశారుగా.

నళిని:-అవును కాని రజనీ, పంతులుగారు నీకింత స్వేచ్ఛ ఇచ్చినప్పటికీ, నువ్వా అనుమానంగారి చపలచిత్తాన్ని ఎందుకు ప్రోత్సహిస్తున్నావో, ఆయన నీమీద ఘాష్టికం చేస్తుంటే ఎందుకు సహిస్తావో, మీరిద్దరూ వెంటనే ఎందుకు పెళ్ళాడేసుకోరో నాకర్థం కాలేదు.

రజని:-నువాయన్ని గురించి అట్లాఅనటం ధర్మంకాదు, నళినీ. మా పెళ్ళికి మానాన్నగారి చావూ ఇతరఇబ్బందులూ అడ్డొచ్చాయి. ఆయనకోరిక కూడా వెంటనే పెళ్ళిజరగాలనే. ఆయన ప్రవర్తన గురించికూడా నువ్వనేది నిజంకాదు. ఆయనకి లేనిపోని అసూయలు నిజంగాలేవు. కొంచెం అనుమానం ఉన్నా కుట్రలేదు. ముక్కోపం ఉన్నా మొరటుతనం లేదు. ప్రేమించటంలో నవనాగరికతలు తెలీని మనిషే కాని ఆయన హృదయం నిష్కల్మషమయినది. తనని ప్రేమించే మనిషికి మరో ప్రపంచమే ఉండకూడదనీ, సదా ఎల్లప్పుడూ తానే లోకంగా ఉండాలనీ ఆయన అభిప్రాయం. అయితే అంతగా ప్రేమించటానికి తనలో ఏముందని మళ్ళా అనుమానం. తనలో ఏమీలేదు గనుక అవతల మనిషి తన్ను సంపూర్ణంగా ప్రేమించటం లేదని బెంగ! ఇటువంటి తత్వంకావటంచేత నేను చాలా బాధపడ్డమాట నిజమే కాని ఇటువంటి లోపా లాయనలో ఎన్ని ఉన్నా నే నాయన రుణం తీర్చుకోలేననే అనుకుంటున్నాను.

నళిని:-నువ్వాయన్ని సమర్థించకేంజేస్తావులే. కాని ఒక విషయం చెప్పు, రజనీ. నిన్నాళ్ళ నీ అనుమానంగారు జలగండం నుంచి తప్పించకపోతే నీకాయన మీద ఇంత ప్రేమఉండేదా?

రజని:- కృతజ్ఞత నా అభిమానాన్ని కొంత పెంచిందేమోగాని అంతకు పూర్వం నాకాయన మీద అభిమానం లేకపోలేదు. కాని ఆ కృతజ్ఞతే చాలు గాదుటే——

నళిని:- పోనిస్తూ! ఏ వెస్తవాడైనా నిన్ను పైకిలాగి ఉండేవాడే. [illegible] గలడు గదా అని ప్రేమించమంటే నావల్ల కావద్దా!

రజని:- అన్యాయంగా మాట్లాతున్నావు.

నళిని:- నవ్వులకంటున్నానే——ఇదేమిటి?

[లక్ష్మి తొందరగా వస్తుంది]

లక్ష్మి:- అమ్మా, మీ అత్తయ్యగారూ నిరంకుశం పంతులుగారూ ఇప్పుడే వచ్చారు.

నళిని:- ఇక్కడికి రాల్లే — లక్ష్మి బయట కాపేసిఉండు.

[లక్ష్మి పోతుంది]

రజని:- నేను వెళ్ళాలే. నేనిక్కడికి వచ్చినట్టు పంతులుగారికి తెలీదు. నన్నిక్కడ చూశారంటే తనవెంట ఊరంతా తిప్పుతానంటారు. మీ అత్తయ్యని మరోసారిచూసి, ఆవిడచెప్పే అపభ్రంశం మాటలు తనివిదీరా వింటానులే.

[లక్ష్మి మళ్ళా వస్తుంది]

లక్ష్మి:- ఓయమ్మో. ఆరిద్దరూ మెట్లెక్కి వొచ్చేస్తున్నారు.

నళిని:- సరే నువు వెళ్ళు, రజనీ! అనుమానంగారికి కబురుచేసే పని కూడా ఉందేమో. ఈ వెనకవేపు మెట్లుదిగి వెళ్ళిపో.

[రజని నళినిని కౌగిలించుకుని వెళ్ళిపోతుంది]

నళిని:- ఇదుగో, లక్ష్మి. ఈ పుస్తకాలన్నీ దాచెయ్యి త్వరగా! "ప్రేమ ప్రసాదం" బుట్టలో వెయ్యి. "ప్రణయోపాసి"ని పమిట కొంగునదాచు. "తారాశశాంకం" దిండుకిందపెట్టు. "వివేకానంద జీవితం" తెరిచి ఉంచు. "వీరనారి" నాచేతికిచ్చెయ్యి. ఆఁ.... ఇక వాళ్ళని రానీ.

[తికమకమ్మా, నిరంకుశం పంతులూ వస్తారు]

తికమకమ్మ:-చూశారా, పంతులుగారూ? ఠోలీ విలవచెయ్యని అప్రయోజకుడు కావాలనే ప్రత్యక్షఅమాయకురాలమగో.

నళిని:-నే ననుకున్న—

తికమకమ్మ:-అనుకోటా లేమిటి? నీకస లనుకోవలిసిన అవసరం ఏముంది? ఈడొచ్చిన ఆడపిల్లల కనుకోవటాలు పనికేరావు. నేను చెప్పేదల్లా ఏమంటే ఆ వెధవని పూర్తిగా మర్చిపో. నీమనస్సులోనించి నిర్లిప్తంగా అక్షయం చేసెయ్యి. అంతే.

నళిని:-మరిచిపోవట మంటే మాటలా? బుద్ధివొద్దని శాసిస్తుంటే మరుపెట్లా వస్తుంది?

తికమకమ్మ:-మా చక్కగా మరవొచ్చు. ప్రయత్నిస్తే మరచటమంత సులభం మరోటి లేనేలేదూ! మీ మామయ్యని నేను సుబ్బరంగా మరిచిపోయినానా, లేదా? అది నావిధిగా భావించుకున్నానూ. అదీకాక ఈ జ్ఞాపకాలు ఈడొచ్చిన ఆడపిల్లలకి పనికేరావూ!

నిరంకుశం:-పొద్దన్నవిషయాలే మరీ జ్ఞాపకం ఉంటాయి. ఇదంతా చదువుకోవటంవల్ల కలిగే జబ్బు)

నళిని:-ఏం తప్పుచేశానని నన్నిట్లా వేధిస్తా రత్తయ్యా?

తికమకమ్మ:-చేసిందంతా ఒక్కసారిగా ఆపాదించెయ్యాలని ప్రయత్నిస్తున్నావు. నాదగ్గిర దుష్టమైన సాక్ష్యంఉందని తెలుసుకో. నువ్వు నే చెప్పినట్టు విని, అయినవాళ్ళు కుదిర్చే సంబంధం చేసుకుంటావా లేదా?

నళిని:-నేను మరొకర్ని చేసుకునేమాట ఉత్తది. మీరంతా నాకు కుదిర్చే మనిషంటే నాకు తగని రోకు.

తికమకమ్మ:-నీకు ఇష్టాఇష్టాలతో సంబంధం ఏమిటే? ఎదిగిన ఆడపిల్లల కవి పనికేరావూ! ఏమైనా ఇష్టాఇష్టాలు రెండూ క్రమేణా పొయ్యేవే గనక కాస్త ఇష్టంలేని సంబంధంచేసుకోవటమే మంచిదీ. మీమామయ్యంటే పెళ్ళికాకమునుపు నాకెంత అసహ్యం! భగవదనుగ్రహంవల్ల మాకిద్దరికీ రుణం తీరిపోయినప్పుడు నే నేడిచినఏడుపు ఎవరన్నా చూసిన పాపాన

పోయినారా? కనక, మేం నీకు మరోసంబంధం చూస్తే నువ్వీళ్ళంగాడిం గాణ్ణి వొదిలేస్తావా?

నళిని:-అటువంటిమాట ఇచ్చి నే నాత్మద్రోహమే చేసుకుంటే. ఆమాటమీద నిలబడకుండా ఉండలేనా?

తికమకమ్మ:-చాల్లే. నీమొహంచూట్టానికే రోతగా ఉంది. నీగదికి పద.

నళిని:-నామొహం ఇంతకంటె అసహ్యంగా చేసుకోవటం నాచాత కాదు, మరి ఏంచెయ్యను? (వెళ్ళిపోతుంది.)

తికమకమ్మ:-చూడండి, ఎటువంటి చుప్పనాతో.

నిరంకుశం:-ఆడపిల్లల్ని చదివిస్తే ఎప్పుడూ ఇంతేనండీ. నాకు వెయ్యిమంది ఆడపిల్లలున్నా ఒక్కర్నికూడా చదివించను.

తికమకమ్మ:-మీరు మరీ అనుమానాస్పదంగా మాట్లాడుతున్నారు, నిరంకుశంపంతులుగారూ.

నిరంకుశం:-నే నిక్కడికి వస్తూ దారిలో మీ మేనగోడలి నౌకరుపిల్లని చూశాను. గ్రంథాలయాలనుంచి పుస్తకాలు పట్టుకొస్తున్నది, పుస్తకాలు! అపుస్తకాలు చూడగానే ఈపిల్లప్రవర్తన నాకిట్టే తెలిసిపోయింది.

తికమకమ్మ:-నిజంగానే గ్రంథాలయాలంత చెడ్డవిలేవు.

నిరంకుశం:-గ్రంథాలయమంటే విషవృక్షమనుకోండి. అది సంవత్సరం పొడుగూతాపూస్తూనేఉంటుంది. ముందు దానివాసనచేత ఆకర్షించబడిన వాళ్ళు క్రమంగా దాని విషఫలాలుకూడా ఆశించితీరుతారు.

తికమకమ్మ:-ఎబ్బే, మీరు చేప్పేది సంగ్రహంగా ఉంది.

నిరంకుశం:-పోనీ మీ అభిప్రాయం సెలవివ్వండి. ఆడపిల్లలకి మీ రే విద్యలు నేర్పిస్తారు?

తికమకమ్మ:-నాకూతురైనమనిషి అక్షరాస్యురాలు కావటం నేనూ ఒప్పుకోనుసుమండీ. జాస్తిగా చదవటం ఆడపిల్లల కసలు పనికేరాదు. సంస్కృతమూ, ఇంగ్లీషూ, తర్కమూ, మీమాంసా మొదలైన భాషలూ; గుణింతమూ ఆమ్రేడితమూ, రసగంధకమూ మొదలైన వ్యుత్పత్తి

విద్యలూ నేను సుతరామూ ఒప్పను. కాని, నిరంకుశంపంతులుగారూ, ఆడపిల్లల్ని చిన్నతనంలోనే బడికి పంపించి కొద్దిపాటి విద్వత్తూ, కళాస్థానాలూ నేర్పించటం ఎంతయినా అవసరం. అయితే లెక్కల్లో కాస్త ప్రాచీనత కూడా ఆడపిల్లలకుండటం మంచిది. అయితే వీటన్నిటికన్నా ముఖ్యం ఏమంటే పిల్లలకి కొంచెం శిల్పవైజ్ఞానం ఉండకపోతే, అపశబ్ద ప్రయోగం చెయ్యటమూ, అశ్లీలంగా మాట్లాడటమూ జరుగుతుంది. మీరా విషయం ఈకాలపుపిల్లల్లో గమనించేఉంటారు. నేను చెప్పిన ఈవిషయాల్లో వ్యర్థ ప్రయోగం ఒక్కటీలేదు.

నిరంకుశం:-పోనివ్వండి, తికమకమ్మగారూ, ఈవిషయం నేను మీతో ఇక వాదించను. ఎందుచేతంటే మీరు చెప్పిందంతా సబబుగా ఉండటమేకాక, నా అభిప్రాయాలనుకూడా కొంతవరకు బలపరుస్తూనే ఉంది—అయితే నేను చెప్పిన విషయమై మీకూ సమ్మతమే నంటారా?

తికమకమ్మ:-ఆహా, సంపూర్ణంగా, బాబుకు నేను పూర్తిగా వాగ్దత్తం అయిపోలేదుగనకా, ఈకోరివి ఇంత మొండిపట్టు పట్టిందిగనకా, బాబుకు ఒప్పుకోని మనిషి మీ అబ్బాయికి ఒప్పుకోవచ్చు.

నిరంకుశం:-అయితే, మరి వెంటనే మావాణ్ణి పిలిపిస్తాను. ఈవిషయం నామనస్సులో కొంతకాలంగా ఉన్నమాట నిజమేకాని మావాడికి బొత్తిగా తెలీదు. వాడిప్పుడు సైన్యంవెంట ఉంటాడు.

తికమకమ్మ:-మే మెవరమూ మీకుర్రాణ్ణి చూళ్లేదు, పంతులుగారూ. అతనికేమీ అభ్యంతరం ఉండదుగద?

నిరంకుశం:-అభ్యంతరమా? ఎన్నిగుండెల్తో? ఎబ్బే, అటువంటిదేమీ లేదు. నామాట కెదురుచెబితే నాకోపం ఎటువంటిదో మావాడెరుగును. చిన్నప్పట్టించీ వాడికిదేపద్ధతి అలవాటుచేశాను. "విశ్వం ఈపనిచెయ్యి", అనగానే వాడుచేసెయ్యాలి. నసిగాడా గూబఅరిచిం దన్నమాటే! అప్పటికీ గొణిగాడా, బయటికి గెంటెయ్యటమే.

తికమకమ్మ:-దివ్యమైన పెంపకం. పిల్లలకు దౌర్జన్యమంత ప్రమేయ

మైనది మరోటిలేదు. సరే, నిరంకుశం పంతులుగారూ- బాబు మాట వాటలేసి మీ అబ్బాయి గురించి ఉద్ఘాటిస్తాను. మా పిల్లను గురించి మీరు కూడా మీవాడితో సాధ్యమైనంతా నిర్వీర్యంగా చెప్పిచూడండి.

నిరంకుశం:-అమ్మా, ఆ జాగర్తంతా నే పడతాను. మీరు పిల్లవాన్ని చెయిదాటి పోనివ్వకుండా చూడండి. కొంచెం కాఠిన్యం వహించాలి మరి, రెండుమూడు రోజులు భోజనం పెట్టటంకూడా ఏ మరుపాటున మరిచారా, పిల్లది చెప్పినట్టల్లా వింటుంది. నేనొస్తాను మరి.

[వెళ్ళిపోతాడు]

తికమకమ్మ:-ఎట్లాగైనా దీన్ని నా ప్రేరణలోంచి వాదిలించుకోవాలి. నాకు కయ్యంపంతులు గురించి ఉన్న అభిభావం దీనికి ఆ చోకీకట్టినట్టు కనపడుతుంది. లక్ష్మిముండ మోసంచేసి నాగుట్టు బయటపెట్టి ఉండదు గద? అబ్బే, అది వొట్టి అమాయకురాలు, అందుచేత దానిచేత ఆమోదింపజేయవలసింది. అది అందరిమాదిరిగా కృత్రిమమైన మనిషయితే ఒక్కనాటికి నమ్మతానా! లక్ష్మి! లక్ష్మి!

(లక్ష్మి వస్తుంది)

లక్ష్మి:-పిలిచారా, అమ్మా?

తికమకమ్మ:-నువు బయటికి వెళ్ళినప్పుడు కయ్యం పంతులుగా కనపించారా?

లక్ష్మి:-లేదమ్మా, ఎక్కడా కనిపియలేదు.

తికమకమ్మ:-ఒసే, నువ్వీ మాటగాని, ఎవరితోగాని—

లక్ష్మి:-అవ్వ! లేదమ్మా, పీకతెగిపోదా?

తికమకమ్మ:-సరేలే! నువు పిచ్చిముండవు, నిన్ను సులభంగా మోసంచేస్తారు.

లక్ష్మి:-లేదమ్మా,

తికమకమ్మ:-కొంచె సేపుండి నా దగ్గిరికిరా, కయ్యంపంతులుగారికి మరో ఉత్తరం ఇస్తా. ఇతర్ల రహస్యాలు నాకు చెబితే చెప్పావుగాని నా

రహస్యాలు మరోరితో చెప్పావా, నా ఆగ్రహం కొల్పుతావు, తెలిసిందా. నన్ను నిర్లిప్తపరిచావంటే పిచ్చిముండవని చూసేదాన్నికాను, జాగ్రత్త.

(పోతుంది)

లక్ష్మి:_హ, హ్హా, హ్హా ! అమాయికత్వమా కాస్త విశ్రాంతి తీసుకో. నాబోటివాళ్లు మొహానికి అమాయికత్వం రాసుకుని కళ్ళు తెరుచుకుని అన్నీ గమనిస్తూ మెలగాలి. ఏదీ నా అమాయికత్వంచేసిన సంపాదనా? (కాగితం తీసిచదువుతూ) నళినమ్మకూ శృంగారంగారికీమధ్య రాయబారం చేసినందుకు. రొక్కం పన్నెండుముప్పావలా, అయిదు పాత చీరెలూ, అంతులేని జాకెట్టులూ, జేబురుమాళ్లూ, రిబ్బనులూ, లేసులూ, శృంగారంగారి దగ్గిర్నుంచి ఆరున్నరా ! వెరశి మూణ్ణెల్ల జీతం. పిచ్చి బాబుగారి ఉత్తరాలు ఎవరికీ అందించనందుకు రెండున్నరా; తికమకమ్మ గారికి మేనగోడలి రహస్యాలు తప్పని సరిఅయి బయట పెట్టినందుకు రెండురూపాయలూ, ఒక పాతచీరా, అమాయికత్వానికీ జై !

# రెండో అంకం

## ఒకటో రంగం: కాప్టెను విశ్వం బస

[విశ్వమూ, చుట్టయ్యా ఉంటారు]

చుట్టయ్య:-నేనక్కడుండగానే నాన్నగారు కాస్త వచ్చేరారండి. నేను తడూకోకుండా తమరే నన్ను పంపారనీ, యోగక్షేమాలు విచారించి రమ్మన్నారనీ అనేశాను.

విశ్వం:-నేనిక్కడే ఉన్నానని తెలిసి నాన్నగారేమన్నారు?

చుట్టయ్య:-అయ్యా.వృద్ధాప్యంలో అంత ఆశ్చర్యపడ్డవాళ్ళని నేనెన్నడూ చూళ్ళేదండి. రెండుమూడడుగులు వెనక్కేసి, నాలుగయిదు మాటలు నోరుజార్చి, ఏంయాడవను తమరిక్కడికి వచ్చినట్టని అడిగారండి.

విశ్వం:-అంటే తమరేమన్నారట?

చుట్టయ్య:-అబద్ధం ఆడేశానండి. ఏమన్నానో సరిగా చెప్పలేనుగాని నిజంమాత్రం బయటపెట్టలేదండి. ఇంతకీ మనం ఇక్కడికి ఎందుకొచ్చినట్టో ఖచ్చితంగా అనుకోటం మంచిదండి; లేకపోతే ఓ లబద్ధాలూనా అబద్ధాలూ కలవ్వండి. నాన్నగారి నౌకర్లువేసిన ప్రశ్నలకంటే లేవండి.

విశ్వం:-కొంప తీసి వాళ్ళతో ఏమీ అనలేదుకద?

చుట్టయ్య:-ఎబ్బే, ఒక్కముక్కకూడా అన్లేదండి. నాన్నగారి బంటివాడు అప్పన్నకు మటుకు——

విశ్వం:-ఓరి నిన్ను పాతెయ్యా? వాడితో నిజంచెప్పేశావా?

చుట్టయ్య:-ఛీ,ఛీ! ఎందుకు చెబుతానండి. వాడికిమటుకు చాలా సందేహాలొచ్చాయండి, కాని వాడికి గొప్పగా టోపీవేసేశాను. "ఒరే, పిచ్చి నాయనా, అప్పన్నా. మా బాబుగారీవూరు తర్ఫీతుకోసం వచ్చా"రన్నాను. ఎందుకో తర్ఫీతో అదిమాత్రం చెప్పలేదండి.

విశ్వం:-తర్ఫీతనే ముక్క ఉపయోగంగానే ఉంది. ఆ మాటమీదే

ఉందాం. అనుమానం తిరిగొచ్చాడా ?

చుట్టయ్య:-వచ్చి పైనున్నారండీ.

విశ్వం:-నాన్నగారూ, రజనీ వచ్చినమాట ఇలనెరుగునా ?

చుట్టయ్య:-లేదనుకుంటానండి — అదుగో, దిగొస్తున్నట్టున్నారు.

విశ్వం:-నేనిక్కడున్నానని చెప్పి పిలుచుకురా.

చుట్టయ్య:-చిత్తం [పోతూ] నాన్నగారొస్తే మసటుకు తర్ఫీదు కోసం వచ్చామని చెప్పండి. బాబూ, మీ పుణ్యం ఉంటుంది,

విశ్వం:-సరే లే. పద. [చుట్టయ్య పోతాడు]. అనుమానంగాణ్ణి రాన్నేపు ఏడిపిద్దాం. పీడిచవల చిత్తమూ వీడూనూ.

[అనుమానం వస్తాడు]

రారా, అనుమానం. సరిగా అనుకున్న సమయానికి తిరిగొచ్చావే.

అనుమానం:-ఏముందీ, నా పనికాగానే తిరిగొచ్చేశాను. ఈలోపుగా ఏమన్నా విశేషాలు జరిగాయా ? నీకూ నళినికీ మధ్య గ్రంథం అవిచ్ఛిన్నంగా నడుస్తున్నదా ?

విశ్వం:-మామూలుగానే ఉంది. నళిని నాతో పోట్లాడిన తరవాత మళ్ళా మేం కలుసుకోలేదు. ఎప్పుడు కలుస్తుందా అని ఎదురు చూస్తున్నాను.

అనుమానం:-మీరిద్దరూ వెళ్ళిపోయి హాయిగా పెళ్ళిచేసేసుకోరాదూ ?

విశ్వం:-నళిని అస్తమానం వాయిదాలేసుకోమంటావా ? భలేవాడివిలే. కావలిస్తే ఈపని ఎప్పుడో చెయ్యలేకపోయినానా ?

అనుమానం:-అట్లా అయితే ఇంక ఈ ముసుగులో గుద్దులాటెందుకూ, వెళ్ళి ఆ ముసలిదానితో నువ్వెవరో చెప్పేసి. మీ నాన్నగారి అనుమతి కూడా తెప్పించుకో !

విశ్వం:-అదే చిక్కు. నా పిచ్చినళిని దమ్మిడీలేని శృంగారంతో లేచి పోవటానికి ఒప్పుకుంటుందేమో గాని అంతో ఇంతో ఉన్న విశ్వాన్ని

తన మేనత్త అనుమతితో అందరిమాదిరిగా పెళ్ళి మంత్రాలతో పెళ్ళాడిందాకా నమ్మకం లేదే! నళినికి యధార్థం మెల్లిగా తెలియజెయ్యాలి. తొందరపడి లాభంలేదు. నువ్వీపూట ఇక్కడే భోంచేస్తావుగాదూ ?

అనుమానం:-కుదరదులే. నలుగురితోనూ కలిసి ఉల్లాసంగా గడిపే స్థితిలోలేను.

విశ్వం:-అందుకే నిన్నుచూస్తే నాకు మండిపొయ్యేది. నీ అంత ఖయాలీ, చపలచిత్తుడూ, శతమొంటీ అయినవాడు ప్రియుడు కావటం ఆడవాళ్ళ ప్రారబ్ధమంటాను. ప్రేమించేవాడివి ధీరుడల్లే ప్రేమించలేవూ?

అనుమానం:నలుగుర్లో పనికిరానని చెబుతుంటినిగా ?

విశ్వం:-నేను ప్రేమించటంలేదురా ? నాలో శృంగారం ఏమన్నా లోపించిందా ? అనుమానమూ, ఆశా, కోరికలూ మొదలైనవన్నీ పెట్టుకుని నీలా మగ్గిపోతున్నానా ?

అనుమానం:-నీకేంరా, విశ్వం ? నాలాగా నువ్వు నీ ఆశలన్నీ ఒక్క మనిషిమీద పెట్టుకునేవాడివికావే. నువ్వు పెద్ద చాపలకోసం గాలం వేస్తావు. ఒకసారికాకపోతే మరోసారి, ఒకచోటకాకపోతే మరోచోట వేస్తావు.

విశ్వం:-నీకిప్పుడు నిరాశ చెందవలసిన అవసర మేమొచ్చిందని ?

అనుమానం:-ఇంకా మెల్లిగా అడుగుతున్నావా ? ఏంజరిగినా జరగొచ్చునే! నా రజని ఆరోగ్యానికీ, ఉత్సాహానికీ, ప్రాణానికే ముప్పు రావచ్చునే! నేను తిరిగిరాలేదని దిగులుపడ్డదేమో, నాకేం జరుగుతుందో అని ఎంత తల్లడిల్లిందో! ఆమె ఆరోగ్యం ఈ కారణంవల్ల ఎంత చెడిపోయిందో! వానకురిస్తే నా రజని కెక్కడ నెమ్ముచేస్తుందో, ఎండ కాస్తే నా రజనికెక్కడ వడదెబ్బ తగుల్తుందో, సాయంకాలం పూట చల్లగాలి సోకి రజని ఏమవుతుందో అని నా ప్రాణం పీకులాడదూ ? ఒరే, విశ్వం. మావంటి సున్నిత ప్రాణులకు క్షణంపాటు ఎడబాటు కలిగినా అన్నీ అనుమానాలే కద!

విశ్వం:-పోనీ, నీరజని కులాసాగానే ఉందని నీకు రుజువిప్పిస్తే నీకీ

అనుమానాలుపోయి మనుష్య ప్రపంచంలో పడతావా ?

అనుమానం:-అంతకంటేనా ? అదేకదా నాక్కావలిసింది.

విశ్వం:-అయితే నే చెబుతున్నాను విను. నీ రజని నిక్షేపంలా ఉంది. కావలిస్తే ఇప్పుడే ఆరోగ్యపురంలోనే ఉందికూడాను.

అనుమానం:-నన్ను వేళాకోళం చెయ్యకు.

విశ్వం:-మా నాన్నగారి వెంట గంటకించాటే వచ్చింపంటూంటే.

అనుమానం:-నిజంగానే !

విశ్వం:-ఎందుకు నీకా అనుమానం. నాన్నగారి అనుకోని ప్రయాణాలు నువ్వెరగవా ? నే చెప్పిందాన్లో అబద్ధంలేదు. నమ్ము.

అనుమానం:-బతికించావురా, విశ్వం—ఒరే, జగ్గూ, నా టోపీ !— విశ్వం, నా ప్రాణం కుదుటపడేలావురా.

[చుట్టయ్య వస్తాడు]

చుట్టయ్య:-పిచ్చెయ్య బాబుగారొచ్చి కిందనిలబడ్డారండీ.

విశ్వం:-కాస్త ఆగరా, అనుమానం. ఈ పెద్దమనిషి నాన్నగారింటి సమీపంలోనే ఉంటాడు. మీ ఆవిడ ఆరోగ్యం గురించి నీకు తగిన సాక్ష్యం ఇస్తాడు....ఆయన్ని పైకి రమ్మనరా, చుట్టయ్యా.

[చుట్టయ్య పోతాడు]

అనుమానం:-మీవాళ్ళకాయన పరిచయస్తుడా ?

విశ్వం:-ఓ! చాలా ఆప్తుడు. అదీకాక మనిషికూడా వింతగా ఉంటాడు.

అనుమానం:-అయితే ఈయనగార్ని కొన్నివిషయా లడగాలి.

విశ్వం:-ఇతను నాకు పోటీదారుకూడాను. అంటే శృంగారానికి పోటీదారన్నమాట. నేను నళిని నెబుగుదునని తెలీక నాతో శృంగారంగురించి చాడీలు చెబుతాడు—

అనుమానం:-ష్ ! వస్తున్నాడు.

[పిచ్చిబాబు వస్తాడు.]

పిచ్చిబాబు:-బహుకాలదర్శనం, కాప్టెన్ విశ్వం. ఇప్పుడే దిగాను, కనిపిస్తోందిగదూ! ఏం ప్రయాణం, విశ్వం! ఛళ్, ఛళ్! ఫక్, ఫక్! వెనక దుమ్ములేపుతో తోకచుక్కల్లే వచ్చేశాను.

విశ్వం:-నువు నిజంగా వింతగ్రహానివే, బాబూ. నువ్విక్కడి కెందు కొచ్చావో నాకు తెలుసులే! ఇదుగో నా మిత్రుడు అనుమానం. ఇతను పిచ్చిబాబురా!

పిచ్చిబాబు:-తమ పరిచయభాగ్యం. అన్నట్టు విశ్వం, ఈయనే నా ఆ-

విశ్వం:-అవును రజనీదేవి అనుమానం!

పిచ్చిబాబు:-చెప్పవూ!....మీ నాన్నగారూ రజనీదేవిగారూ నాకన్న ముందే దిగిఉండాలి. నువు చూశావేమో!....నిజంగా నండీ, అనుమానం గారూ, మీరు ధన్యులు.

అనుమానం:-నే నింకా రజనిని చూళ్లేదు లెండి. ఆవిడ ఆరోగ్యం బాగుంటున్నదా?

పిచ్చిబాబు:-ఏ మారోగ్యమనుకున్నారంటే! అద్భుతం. ఎంతచక్కటి గులాబీచాయ! ఓహోహో!

అనుమానం:-చిత్రమే! ఆవిడ ఆరోగ్యం అంత బాగా లేదన్నారెండి.

పిచ్చిబాబు:-పచ్చిఅబద్ధమండి! మిమ్మ ల్నేడిపించటాని కనిఉంటారు. అటువంటి దేమీలేదు.

అనుమానం:-చూశావా, విశ్వం. నాకన్న నయమేకాదూ. భయపడి కృశించింది నేనేగా!

విశ్వం:-ఆవిడ అనారోగ్యంగా లేదని గునుస్తున్నావురా?

అనుమానం:-ఎబ్బె, నా అభిప్రాయం అదికాదు. నేను దగ్గర్లేని సమయంలో కించిత్తు ఆరోగ్యం చెడిపోతే అందులో అనౌచిత్యం ఏమీ లేదంటాను. ఈవిధంగా ఆవిడ ఆరోగ్యంతో వెల్లివిరపటం నీకేమైనా భావ్యంగా ఉందా?

విశ్వం:-అవునులే, నువు దగ్గిర్లేనప్పు డావిడ మంచంపట్టకపోవటం చాలా అధర్మమే.

పిచ్చిబాబు:-మంచి కొంప సంపాదించావు, విశ్వం.

అనుమానం:-అవునండీ, లేపుప రజనియొక్క ఆరోగ్యంగురించి అపరిమితంగా చెప్పారే. ఆవిద ఉత్సాహాతిశయాలతో తబ్బిబ్బవటం లేమరప ?

పిచ్చిబాబు:-అడక్కండి. ఆవిడచుట్టూ పసంతం తాండవించవలసిందే. ఏం ఉల్లాసం, ఏం ఉత్సాహం! ఉర్రో! ఏం పకపకలు, ఏం వికవికలు! అప్ప!

అనుమానం:-వింటున్నావురా, విశ్వం! ఈ ఆడవాళ్ళలో ఈ వెకిలితనం ఎందుకు పెట్టాడో భగవంతుడు. నేను దగ్గిరలేకుండా చూసి ఇంత ఆనందమా ?

విశ్వం:-ఇక చాలించరా, ఎపరన్నా నవ్విపోతారూ! ఇప్పుడేకదూ ఆవిడ ఖిన్నురాలై ఉంటుందని గునిశావూ ?

అనుమానం:-నాలో ఏమన్నా ఉల్లాసం చూశావా, చెప్పు!

విశ్వం:-ఎప్పే, ఎవరన్నారూ ?

అనుమానం:-నేను మిమ్మల్నందర్నీ కడుపుబ్బ నవ్వించానా ?

విశ్వం:-ఛీ, ఛీ! ఎంతమాటా!

అనుమానం:-నాలో పకపకలూ వికవికలూ కనిపించాయా ?

విశ్వం:-రామరామ! తుమ్మల్లో పొద్దూకినట్టున్న నీమొహం చూసి అంతమాట పెప రనగలరురా ?

పిచ్చిబాబు:-పాపం, వీరికేంజబ్బూ ?

విశ్వం:-రజని హుషారుగా ఉందని విని అపురుషుని సంతోషిస్తున్నాడు అంతకంటె మరేమీలేదు. అవునా, అనుమానం ?

అనుమానం:-అవునవును. ఆవిడ కులాసాగా ఉందని నాకు చాలా సంతోషంగా ఉంది. అసలావి దెప్పుడూ సరదామనిషి.

పిచ్చిబాబు:-దానికి సందేహ మేమిటి? చాలా ప్రతిభావంతురాలు కూడానూ. ఎంత కమ్మనిగాత్రం! ఫిడేలు ఎంత చక్కగా వాయిస్తుంది! అగమకాలూ, కళలూ, సంగతులూ, తానాలూ! వీణావారింటో గానసభ జరిగితే ఎంత చక్కగా పాడింది.

అనుమానం:-చూశావా! దీని కేమంటావో చెప్పు. నన్ను గురించి ఆలోచనేలేకుండా నిశ్చింతగా పాటలతో కాలక్షేపం చేసిందన్నమాట.

విశ్వం:-పోరా పిచ్చివాడా! గ్నానం ప్రేమలక్షణం కాదూ?

అనుమానం:-సరే, పోనీ, నువు చెప్పినట్టే అనుకుందాం. ఇదుగో, చూడండి! మీ పేరేమిటో? ఏమేం పాటలు పాడిందో చెప్పగలరా?

పిచ్చిబాబు:-చెప్పలేనండి.

విశ్వం:-కొంచెం ఆలోచించు. విరహసంబంధమైన పాటలు పాడలా? "నన్నిడిసిపెట్టెల్లినాడే నారాజు"—

పిచ్చిబాబు:-ఆపాట పాడలా.

విశ్వం:-పోనీ, "దూరాన నారాజు కేరాయిడౌనో!" (పాడతాడు)

పిచ్చిబాబు:-అబ్బే, అటువంటి దేమీలేదు. అదుగో, జ్ఞాపకం వచ్చింది. "నన్నేవరాపలే రీవేళా, నాధాటికోపలే రీచేళా" (పాడతాడు)

అనుమానం:-చచ్చువెధవను! ఇటువంటి మనిషికోసమా తపించాను? పాటకచ్చేరీలు చెయ్యటమేకాకుండా, తన వెకిలితనం బయటపెట్టుకునే టందుకు లల్లాయిపదాలు పాడుతుందిగదా, దీనికేమంటావో చెప్పుచూతాం.

విశ్వం:-అనుకోవటాని కేముందీ? సరదాగా ఉందిగదా అనుకుంటాం.

అనుమానం:-నువు పొరపడుతున్నావు. ఆవిడ సరదాగా ఉండటం నాకూ ఎంతో ఇష్టం. నాకు చాలా సంతోషంగా ఉందికూడాను. అయితే, దాందుంపతెగా, ఆ పాడేపాటల్లో అయినా కాస్త తన హృదయవేదన వ్యక్తపరిచే పాటగా చూసి పాడితే ఇంతలో ఏం పోయిందీ? ఏన ఉత్సాహంలోకూడా కాస్త నిగ్రహమూ, ఆనందంలోకూడా కొంచెం విషాదమూ కనబరచవచ్చుగా! ఓవేళ నృత్యాలుకూడా చేసిందేమో?

పిచ్చిబాబు:-ఏమి టాయన నృత్యమంటున్నట్టున్నారు ?

విశ్వం:-మన మనుకునే ఆవిడకు సంగీతమేకాక నృత్యంకూడా వచ్చునంటున్నాడు.

పిచ్చిబాబు:-దానికి సందేహ మేమిటీ ? ఆనాడు విందుసందర్భంలో——

అనుమానం:-అదుగో, అదుగో ! నే చెప్పలా ? ఏం లాభం ? నేను అటు మొహం తిప్పగానే ఆమనిషిలో ఎక్కడ్లేని జీవమూ వస్తుంది ! నృత్యాలా? నా అనుభవానికీ ఆవిడ అనుభవానికీ హస్తిమశకాంతరంకూడా సంబంధంలేందే ! ఎంత చిత్తక్షోభ పడ్డాను, ఏవిధంగా తల్లడిల్లాను, ఎంత దైన్యంగా ఉన్నాను ! క్షణమోయుగంగా, ప్రతిరాత్రీ కాళరాత్రిగా గడిపానే ! ఆవిడ కెంత ఆరోగ్యం ! ఎంత ఆనందం ! ఏం పాటలు ! ఏం ఆటలు ! ఛీ, ఛీ, ఎంత చపలచిత్తం !

విశ్వం:-ఓసి, నాయనా, నిష్కారణంగా పెడసర్వయిపోతున్నావు. శాస్త్ర తమాయించుకో. నృత్యంచేసిందే అనుకో, ఏం చేస్తే ? సంఘ మర్యాదంటూ అపాటి——

అనుమానం:-నేను తమాయించుకుంటాను, నువు చెబుతున్నావుగనక. ఏమండీ, బాబుగారూ, ఏం నృత్యాలు చేసిందన్నారూ ? భరతనాట్యమా ?

పిచ్చిబాబు:-భరతనాట్యం చేసిందనుకోండి. అసలు ఎన్నవలిసిం దది కాదు. కోయవాళ్ళనృత్యం చేసిందండీ ! అబ్బ, చెప్పలేం ! చూసి తీర వలిసిందే ! ఆ ఒళ్ళు కదపటమూ అదీ, అబ్బ !

అనుమానం:-దీని సిగవరగా, విశ్వం, దీన్నెట్లా సమర్థిస్తావో చెప్పు, చూస్తాను. సమర్థించవేం ? నృత్యాలా ? వొళ్ళు కదపటమా ? కళ్ళుకొట్టి కులకటమా ? ఇప్పుడు నన్ను తప్పుపట్టగలవా ? భరతనాట్యమంటే పోనీ అనుకోవచ్చు. అది నేను క్షమింతును! దొమ్మరాటలా? ఎట్లా క్షమించటం? చూసేవాళ్ళంతా తాతలూ తండ్రులూ అయితే తప్ప. ఎంత హీనమైనపని ! ఒకే ప్రియుడికి మనస్సుంచిన నాగరికతగల ఆడది చెయ్యవలిసిన పనేనా?

విశ్వం:-తాతలూ, తండ్రులూనూ ! నీమొహం కాదూ ?

అనుమానం:-చూసేవారిలో ఒక్క వెకిలిమనిషిఉంటే ఆ వెకిలితనం కార్చిచ్చులాగా అందరికీ అంటుకుంటుందే! అందరిరక్తం ఉడుకెత్తి పోతుందే! అందరినిట్టూర్పులూ చేరి గాలి వేడెక్కి కామం ఉద్రేకిత మవుతుందే!....నాతల తిరుగుతోంది. నేపోవాలి, నన్ను పోనీ!

(పోబోతాడు)

విశ్వం:-ఆగరా! ఈవార్త తెచ్చినందుకు బాబుకు అభినందనాలు చెప్పి మరీ పో.

అనుమానం:-అదుక్కు తిన్నట్టేఉంది వార్త! (పోతాడు)

విశ్వం:-పాపం అయిదునిమిషాలకింద వాడి కేచింతాలేదు.

పిచ్చిబాబు:-తనప్రియురాల్ని మెచ్చుకున్నానని ఉడుక్కుంటున్నాడా ఏం?

విశ్వం:-ఏపాటో అసూయనుకుంటాను, బాబూ.

పిచ్చిబాబు:-ఛా! హిహ్హిహ్హి! నన్నుచూసి అసూయా? భలే బాగుందిలే!

విశ్వం -అందులో వింతేమిటేం? నీ నాజూకూ నీ తమాషామూసి ఇక్కడి అమ్మాయిలు ఖుషీఅయిపోరనా?

పిచ్చిబాబు:-అన్నీ వొట్టిదే! హహ్హహ్హ! ఎగతాళి కంటున్నావు! హహ్హ! అయినా నేను పరాధీనుణ్ణి కద, నళిని నన్ను సొంతం చేసేసుకుంది. పల్లెటూళ్లో ఉండగా నేని స్త్రీ మడతలు వేసుకోనని నన్నుచూసి సహించ లేక పొయ్యేదిగాని. ఇప్పుడా! చూసుకో! టాక్ టీక్! ఎటువంటి దర్జాఅయిన డ్రెస్సు వేసేస్తానో! జుట్టుకు మంగలాడి కత్తెర తగిలికూడా చాలా కాల మయిందిలే!

విశ్వం:-అయితే మరికాస్త నాజూకు తేలు.

పిచ్చిబాబు:-తేల్తానా, తేల్తానా! అప్పుడా శృంగారంగాడికి నాటిడా ఖా చూపిస్తాను! ఎవడెక్కువో!

విశ్వం:-భేషయినమాటన్నావు పో!

[చుట్టయ్య వస్తాడు]

చుట్టయ్య:-తమ కోసం ఎవరో పెద్దమనిషి వచ్చారండి. లోపల కూచో పెడుదునా ?

విశ్వం:-కూచో పెట్టు.

పిచ్చిబాబు:-అయితే మరి నేను శలవుపుచ్చుకుని—

విశ్వం:-కొంచెం ఉండి, ఆ వచ్చిన వారెవర్రా, చుట్టయ్యా ?

చుట్టయ్య:-పెద్ద బాబుగారండి.

విశ్వం:-ఓరి గాడిదా- పై కెందుకు రమ్మనలేదురా?

(చుట్టయ్య పోతాడు)

పిచ్చిబాబు:-సరే, నువ్వూ మీ నాన్నగారూ ఏవో గొడవలు మాట్లాడుకుంటారు. నాకోసం తికమకమ్మ కబురుపెట్టి ఉంటుంది, కయ్యం పంతులుగార్ని రమ్మన్నానుకూడా. అంచేత నే వెళ్ళొస్తా. పోతే నువ్వు నాకు రాత్రికి విందుచెయ్యాలి.

విశ్వం:-ఓ, నిరభ్యంతరంగా. (బాబు పోతాడు)

ముసలాయన ఉపన్యాసం దంచేస్తాడు గామాలు. నే నిక్కడ ఉన్నందుకు కారణం కొంపదీసి ఆయనకు తెలీదుకద! ఈన జబ్బుచేసి అక్కడే పడుండకూడదూ ?

(నిరంకుశంపంతులు వస్తాడు)

రాండి! మీ ఆరోగ్యం బాగున్నందుకు చాలా సంతోషం. మీ రిక్కడి కొచ్చారనగానే జబ్బుచేసిందేమోనని చాలా భయపడ్డాను.

నిరంకుశం:-భయపడవలసినవిషయమేమూ ! అవుతే, నువ్విక్కడ తర్ఫీదుమీదున్నావూ ?

విశ్వం:-అవునండి.

నిరంకుశం:-బాగుందిరా, అబ్బీ! నువ్విక్కడ తటస్థపడతా వనుకోలేదు, ఎంచేతంటే ఓ చిన్నవ్యవహారంగురించి నీకింకా రాతామనుకుంటున్నాను. నేనూ పెద్దవాణ్ణయిపోయినాను. ఇంక అట్టేకాలం నిన్ను బాధించను.

విశ్వం:-అట్లా అనకండి. మీ ఆరోగ్యం చక్కగా ఉంది. ఎంతకాలమైనా జీవిస్తారు.

నిరంకుశం:-సరే పోనీ నువ్వన్నట్టే కానీ. ఇంకో పదేళ్ళవరకి నిన్ను వేధించుకుతింటాను. సరా ? నే చెప్పొచ్చేదేమంటే నీఉద్యోగం మీద వచ్చేడబ్బులూ, నేను పంపేవీ కలిపి నీఖర్చులకే చాల్తుంది :

విశ్వం--నిజం చెప్పారు.

నిరంకుశం:-అంచేతనూ, నే బతికుండగానే నాకొడుకు గొప్పస్తినా బతికితే చూడాలనుంది. అందుకని నీకు చక్కని ఆస్తి ఒకటి ఏర్పాటు చేతామని పుట్టింది, చెప్పొద్దూ.

విశ్వం:-మీరు నావిషయంలో ఇంత ఆదరంగా ఉన్నందుకు నే నెంతైనా కృతజ్ఞుణ్ణి.

నిరంకుశం:-నువు సంతోషిస్తావని నే నెరుగుదును. నీకో పెద్ద జమీందారీ త్వరలోనే ఏర్పాటుచేస్తాను.

విశ్వం:-నాకృతజ్ఞతగురించి చెప్పటం చేతకాదు. నాప్రవర్తనే చెబుతుంది. అయితే నేను సైన్యంలో ఉద్యోగం మానుకోవాలనా మీ అభిప్రాయం.

నిరంకుశం:-అదంతా నువ్వూ నీభార్యా చూసుకుందురుగాని.

విశ్వం:-నాభార్యా అండీ ?

నిరంకుశం:-అవున్రా ! అదంతా మీరూ మీరూ చూసుకుందురుగాని.

విశ్వం:-ఏం భార్యండి ?

నిరంకుశం:-అవును, నీభార్యే ! ఏం, ఆవిషయం నీకు చెప్పలేదూ.

విశ్వం:-ఒక్కముక్కకూడా చెప్పలేదండీ.

నిరంకుశం:-అదేమిటి ? దానివిషయం చెప్పకపోతే ఎట్లా ? నీకీ ఆస్తి ఒక భార్యాద్వారా సంక్రమించబోతున్నది. విశ్వం, అయితే మటుకేం ?

విశ్వం:-మీ మాటలు చాలా వింతగా ఉన్నాయి.

నిరంకుశం:-ఏదికేం పతిపోయింది; ఇప్పుడేకామరా ఎంతో కృతజ్ఞతగా మాట్లాడావూ?

విశ్వం:-అవునండి. మీరు ఆస్తిగురించి చెప్పారు గాని భార్యగురించి చెప్పందే!

నిరంకుశం:-రెండూ ఒకటి కావా ఏమిటి? ఆస్తివచ్చేటప్పు డందులో ఉండే గొడ్డూ గోదారామా?

విశ్వం:-నాసుఖంగురించి నీసంకల్పంలో నాకీక్రయమే ఇష్టంలేకపో వచ్చు, చూడండి. ఎవరీ పెళ్ళికూతురు? ఏలుకుంటా.

నిరంకుశం:-అదంతా నీకనవసరం. ఆపిల్లని పెళ్ళాడి పాలిస్తానని తక్షణం నాకు మాటిస్తావా, లేదా?

విశ్వం:-నేను ఎవరో తెలీ ఎరగని మనిషిని ప్రేమించి పాలిస్తానని మాటివ్వమనటం సాధ్యంగాలేదు.

నిరంకుశం:-ఎరగని మనిషి కళ్యాణం చెప్పటం, ఆమాటకొస్తే, అసలే సాధ్యంగాలేదా!

విశ్వం:-అయితే ఉన్నమాట చెప్పేస్తున్నాను వినండి. నాహృదయం అదివరకే మరోస్త్రీకి వశం అయిపోయింది.

నిరంకుశం:-అయితే నీహృదయాన్ని ఆమెకి క్షమాపణ పంపించు. ఇక్కడ మరో పెద్దసామ్రాజ్యం ఉందని చెప్పు.

విశ్వం:-నామాటమహా వొట్టు పెట్టేశాను.

నిరంకుశం:-వొట్టు పెట్టేస్తే తనపేర కొట్టేయించుకోమను! నీమాట కోసం వ్యాజ్యానికి వెళ్ళటం పొట్టిపండగ! పైగా ఆవిడకూడా తనమాట నీకు వాకట్టు పెట్టిందేమో రెంటికీచెల్లూ! తెలిసిందా!

విశ్వం:-క్షమించండి. ఈ ఒక్కవిషయంలోనూ మీమాట నేను అతిక్రమించక తప్పదు.

నిరంకుశం:-జాగ్రత్త, విశ్వం. నే నింతసేపూ ఎంతో ఓర్పుతో ఉన్నాను—ఎంతో నిగ్రహించుకున్నాను. నామాట విన్నంతసేపూ నా

అంత మంచివాడులేడు; నాయిష్టానుసారం జరిగితే నాకింకే సాక్షివ్వ లేడు! నాకోపం తెప్పించకు.

విశ్వం:-ఈ ఒక్కవిషయంలోనూ మీరు నన్ను క్షమించి తీరాలి.

నిరంకుశం:-ఛీ, అప్రయోజకుడా! నిన్నిక పేరుపెట్టి పిలిస్తే ఒట్టుపెట్టు.

విశ్వం:-కాస్త నామాటకూడా వినండి.

నిరంకుశం:-నేను వినను! నీమాట వినను! ఒక్కమాటకూడా వినను! కనక ఒప్పుకున్నట్టు తల ఆడించు—నే నిదే చెబుతున్నాను, విశ్వం—అంటే, కుంకవెధవా!—నే చెప్పినట్టు విని—

విశ్వం:-ఎవరో కురూపిని పెళ్ళాడమంటా రుటండీ?

నిరంకుశం:-ఓయ్! ఏం కురూపయితే! వాట్టికోతియైగాక, గూనిదయినాగాక, అష్టావక్రఅవుగాక, గుడ్డిదవుగాక, ముసలితొక్కవుగాక, నే చెప్పాను గనక నువు అస్తమానమూ దాన్ని చూసి గురకపెయ్యాలి. తెల్లార్లూకూచుని దానిమీద ప్రణయగీతాలు రాయాలి!

విశ్వం:-ఇది చాలా న్యాయంగా ఉంది.

నిరంకుశం:-వెటకారమా, వెధవా? నన్ను చూసి నవ్వుకుంటున్నావా, నాపా?

విశ్వం:-ఇది నాకు హాస్యం ఆడవలసినవిషయంగా కనిపించటం లేదండి.

నిరంకుశం:-అయితే మరి నన్ను చూసి లోలోపల ఎందుకు నవ్వు కుంటున్నావ్? నే వెళ్ళగానే విరగబడినవ్వవూ?

విశ్వం:-నేను తండ్రిని చూసి నవ్వేటంత అవివేకినికాను.

నిరంకుశం:-ఇంత అహంకారమా! ఇంత పొగరుమా! నాదగ్గిర సాగవు, తెలిసిందా?

విశ్వం:-నే నెంతో శాంతంగా ఉన్నానండి.

నిరంకుశం:-పచ్చిఅబద్ధం! నీగుండెలో ఎంతో రోషముంది. నాకు తెలుసురా, దొంగవెధవా! నాదగ్గిర సాగదు.

విశ్వం:-ప్రమాణపూర్తిగా అటువంటిదేమి లేదండి.

నిరంకుశం:-అట్లా నోరుచించుకుంటావేం పుత్రా! నామాటవినా శాంతంగా మాట్లాడలేవూ? మరాగ్రహంవల్ల తోలినిలవైనా ఉంటావా? మరాగ్రహం వల్ల ఏమి లాభంలేదురా, అప్రాచ్యపు బుద్ధికక్కూడదురా!—అదిగో, నన్ను చూసి నవ్వుకుంటున్నావ్!—నాకోపం తెప్పిస్తావు పుత్రా?—నామంచితనం అలుసుతీసుకుంటావు పుత్రా? వెధవకానా, వెధవకానాఅనీ! మెత్తనివాడు గదాఅని ఒత్తుతావా? ధర్మరాజంతటివాడి శాంతానికూడా హద్దుంటుందని ఎరగవూ? చూసుకో! నే చెప్పినట్టు చెయ్యటానికి అరున్నరగంటలు టైమిచ్చాను. మారుమాటాడకుండా, ఈలోపుగా, నే చెప్పిందల్లా చెయ్యటాని కొప్పుకుంటివా ఎప్పటికైనా నిన్ను క్షమిస్తానేమో! లేనట్టయ్యెనా నే నున్నదేశమూ ఖండమూకూడా వదిలిపో. నేను పీల్చే గాలీ చూసే వెలుతురూ నువ్వువయోగించకు. నీ ఉద్యోగం ఊడ తీసేయిస్తాను. నీపేర అయిదురూపాయల మూడణాలు బాంకులోవేసి దానిమీది వడ్డీతో నువు బతికేలాగు భరణం ఏర్పాటుచేస్తాను. నువు నాకొడుకువే కాదు. నా ఆస్తిలో నీకొక్కదమ్మిడీ ఇవ్వను. నిన్ను మళ్ళీ 'విశ్వం' అని పిలిస్తే ఛీ అను! (పోతాడు)

విశ్వం:-(స్వగతం) ఏమిదయ, ఏమిమార్దవం, ఏమివాత్సల్యం! ఇటువంటి విషయాలను చర్చించటంలో ఎంత నాజూకు! ఈయనకు నా రహస్యం చెప్పి లాభంలేదు. నా నెత్తిన ఏ ఆస్తిగల ముసలమ్మను రుద్ద జూస్తున్నాడో తెలీదు. మళ్ళా తను ప్రేమించి పెళ్ళిచేసుకున్నవాడే! సుఖం ఎరిగినవాడే!

(చుట్టయ్య వస్తాడు)

చుట్టయ్య:-అబ్బో పెదబాబుగారి కెంతరౌద్రం వచ్చిందండి. మెట్ల మీదినుంచి మాకుతూవచ్చి, తిట్టుకుంటూ, హూంకరిస్తూ పక్కగా నిలబడి ఉన్న నామీద కర్రపెట్టి కొట్టి అది తీసికెళ్ళి తమ కిమ్మన్నారండి. నాతండ్రే ఇలాచేస్తే నే నెప్పటికీ వాడిసావాసం కట్టనండి.

విశ్వం:-నోరుముయ్, వెధవా! ఇందుకేనావచ్చావ్? లే, దాన్లోంచి!

(చుట్టయ్యని పక్కకి తోసి వెళ్ళి పోతాడు)

చుట్టయ్య:-(స్వగతం) తండ్రిగా రొచ్చి మాయజమానిగార్ని తలవాచేట్టు పెడితే, ఆయనకు సమాధానం చెప్పలేక ఆ అక్కసంతా ఏపాపం ఎరగని చుట్టయ్యమీదనా వెళ్ళగక్కటం? ఒకరిమీదికోపం మరొకరిమీద తీర్చుకోటంకన్న ఘోరం—అన్యాయం—

[ఒక కుర్రాడు వస్తాడు]

కుర్రాడు:-చుట్టయ్యగారూ? చుట్టయగారూ? దొరగారు పిలుస్తున్నారు.

చుట్టయ్య:-ఎందుకురా అట్లా నోరుచించుకుంటావ్, తప్పుడుకుంకా!-భయంకరమైన—

కుర్రాడు:-త్వరగా రండి, చుట్టయ్యగారూ!

చుట్టయ్య:-త్వరగా రావాలా! మాలకుంకా! నువ్వెట్రా నన్నాజ్ఞాపించేది. నిన్ను చీల్చి గద్దలకెయ్యా! నీ ఎముకలు సున్నంచెయ్యా! నీపీకె పిసి కెయ్యా! నిన్ను— (కుర్రాణ్ణి తన్నుకుంటూ పోతాడు)

## రెండో రంగం: ఉత్తరపు మైదానం

(లక్ష్మి వస్తుంది)

లక్ష్మి:-మా అమ్మగారికి కాప్టెను విశ్వంగారు మరోపరుడా? మన చెయ్యి తడిఆయేవరకూ మనకేమిటి అతగాడుతో సంబంధం? పాపం, పిచ్చిబాబుగారికి ఉద్వాసన అయిపోయింది. పోనీలే! ఆయనతో శృంగారంగారి రహస్యం చెప్పేసి ఆయన రుణం తీర్చుకున్నాగా. కయ్యంపంతులుగా రివాళ ఆలస్యంచేశాడేమబ్బా? తన కుత్తరాలు రాసే ఆపెడకి యాభై యేళ్ళుంటాయని తెలిస్తే నీరుకారిపోతాడు పిచ్చిబామ్మడు.

(కయ్యం పంతులు వస్తాడు)

కయ్యాం:-ఏమే, మదనికా! నీకోసం అరఘంట సేపట్నుంచీ దక్షిణ మైదానంలో కనిపెట్టుకుని ఉంటినిగదే!

లక్ష్మి:-అయ్యో! నాయిల్లు బంగారంగానూ! నేనింతసేవూ ఈ ఉత్తర మైదానంలో తమ కోసం వేచుకునుంటినే!

కయ్యాం:-అంచేతనే నేమో మనం ఒకరికొకరు కనుపించలేదు. నువ్వొస్తే కనిపిస్తావుగదా అని కాఫీ హోటల్లో కిటికీ కెదురుగాకూచుని ఓ చిన్న కునుకుకూడా తీశా.

లక్ష్మి:-ఇంకేం? తమరు నిద్రల్లో ఉండగా నేను పక్కగావచ్చి ఉంటా.

కయ్యాం:- నిద్రలేచి చూసుకునేవరకూ ఇంత ఆలస్యమయిందని కల్లో కూడా అనుకోలేను. అయితే, పిల్లా, నాకేం తెచ్చావు?

లక్ష్మి:-ఉత్తరం తెచ్చానండి.

కయ్యాం:-భేష్! నువ్వు ఉత్త చేతుల్తోరావని నాకు తెలుసునా. ఏదీ చూడనీ. మీ ఆవిడ ఏమంటుందో?

లక్ష్మి:-ఇదిగోండి! (ఉత్తరం ఇస్తుంది.)

కయ్యాం:-(తీసి చదువుతూ) "అయ్యా! అనేక సంవత్సరాల గృహ సమాగముమువల్ల కలిగిన విద్యుద్వేగం ప్రేమద్వారా కలుగుట అతిశయోక్తికాదు. కయ్యాం పంతులుగారి ప్రాథమిక దర్శనమునందే నా కలాటి ఆవేదన కలిగినది." చాలా ముచ్చటగా ఉంది. "స్త్రీ సహజమైన వికృతి నా చేతిని గ్రహించివేయుచున్నది. అయినను కయ్యాం పంతులుగారు నా ప్రేమ ప్రసాదమున కర్హులగుటవలన నా కవ్యాజమైన ఆనందము కలుగుననుటలో సందియములేదు——చాతకి."

ఓయమ్మో. లక్ష్మి, మీ అమ్మగారి మాటల తడాఖా ఎంత పెద్దదే! ఆవిడకి చెయ్యిచాస్తే మాటలందు తాయల్లే ఉంది.

లక్ష్మి:-ఆశమ్మో! ఆవిడగారి అనుభవం?

కయ్యాం:-అనుభవమా? పదిహేడేళ్ళకే?

లక్ష్మి:-అవునులెండి: అయితే ఎంత చదువుతుందనుకున్నారు! ఉత్తి

పుణ్యానికే చదివేస్తుందండి.

కయ్యం:-ఇట్లా రాస్తుందంటే వాగా చమవ్వున్నదే అయివుండాలి. ఈకాస్త ఉత్తరం చూస్తేనే మాట లావిడ కెంత బానిసలో తెలుస్తోంది. వాటి విముక్తికోసం ఒక ఉద్యమం నడిపినా తప్పులేదు.

లక్ష్మి:- మిమ్మల్ని గురించి ఆవిడగారెట్లా మాట్లాడతారో ఎవివి విననేలేదు.

కయ్యం:- నావంటి మొగుడు తనకి లభించడని చెప్పు. అయితే ముసలావిడ ఒప్పుదల సంపాదించాలి. లేకపోతే హాస్యంగా ఉండదు,

లక్ష్మి:-అయితేసరి, మీ రాటేభాగ్యవంతులు కారేమోనండి?

కయ్యం:-అదేనే వచ్చినతంటా! భాగ్యవంతుణ్ణికాను గనకనే అన్యాయానికి పాల్పడలేకుండా ఉన్నాను. నేనే భాగ్యవంతుణ్ణయి ఉంటే, మీ అమ్మాయిగారినీ ఆవిడ ఆస్తినీ కాజెయ్యటాని కింత పస్తాయిస్తానా? (డబ్బిస్తూ) ఇదుగో, పూలుకొనుక్కో. సాయంకాలం కనిపించు. ఈ ఉత్తరానికి జవాబు రాసిస్తాను. మళ్ళా మరిచిపోతావేమో ఓ ముద్దు పుచ్చుకో. (ముద్దు పెట్టుకుంటాడు.)

లక్ష్మి:-భలే పెద్దమనిషల్లేండి. ఇదంతా తెలిస్తే మా అమ్మగారు మీకేసిచూడరు.

కయ్యం:-మా చక్కగా చూస్తుంది. ఆడవాళ్ళు పైకెన్నిమాటలు చెప్పినా, గడుసు మొగాళ్ళంటేనే ఇష్టం. అందుకని నేను నీకేమన్నా ముద్దిచ్చానా అని అమ్మగారు నిన్నడిగితే వంద ముద్దులిచ్చారని చెప్పు.ఏం?

లక్ష్మి:-అబద్ధాలు చెప్పమన్నారండీ?

కయ్యం:-అయితే నిజంగానే ఇచ్చేదా!

లక్ష్మి:-చాల్లే ఊరుకోండి. ఎవరో వస్తున్నారుకూడా.

కయ్యం:-తప్పించుకుపోయినావు పో.

(చుట్టయ్యరాక గమనించి ఏదో పాడుకుంటూ వెళ్ళిపోతాడు)

(చుట్టయ్య వస్తాడు)

చుట్టయ్య:-ఏం. లచ్చుమ్మా ?

లక్ష్మి:-అయ్యో, అట్టా దడిపిస్తాడేం ?

చుట్టయ్య:-హాల్లే, నీ దొంగవేషాలుచూసి సంతోషించేటందు కిక్కడ ఎవరూ లేరు. కయ్యంపంతులుగారి కేదో ఉత్తరం అందిస్తున్నావే. ఇది మా యజమానికి ముందు తెలియజేయాలి.

లక్ష్మి:-అహ్హాహ్హా ! ఇదేనా నీకు తెలిసిందీ ? ఆ ఉత్తరం రాసింది తెకమ కమ్మ. ఆవిడకి కయ్యంపంతులుమీద మనస్సుపోయింది.

చుట్టయ్య:-ఛా ! ఏం మనుషులు, ఏం ఆలోచనలు ! అయితే చిన్నా విడ మాయజమానికేమన్నా కబురు పంపించిందా ?

లక్ష్మి:-పెద్ద ఘోరంజరిగింది, చుట్టయ్యా ! పిచ్చిబాబుగా వెళ్ళిపోతే అంటకంటె ప్రచండుడొచ్చాడు. నిరంకుశంపంతులుగారు తన కొడుక్కు మా అమ్మగార్ని చేసుకుంటామని అడిగేశారు.

చుట్టయ్య:-విశ్వంగారికే ?

లక్ష్మి:-ఆహా ! తలుపు వెనకనుంచి నే వింటేనే ?

చుట్టయ్య:-హహ్హహ్హా ! చాలా బాగుంది. ఈవార్త త్వరగా పట్టు కెళ్ళాలి. వస్తా, లచ్చమ్మా.

లక్ష్మి:-సుబ్బెట్టాగే నవ్వరావులే. కాని ఇందులో అబద్ధంలేదు. (పోతూ) అయితే మీ యజమానిగార్ని భయపడొద్దని చెప్పు.

చుట్టయ్య:-మనం చెబితే తలకెక్కుతుందా ?

లక్ష్మి:-విశ్వంగారితో పోట్లాట పెట్టుకోవద్దను.

చుట్టయ్య:-ఆ భయంలేదులే.

లక్ష్మి:-బేజారు కావద్దను.

చుట్టయ్య:-ఏం ఫర్వాలేదు.

( ఇరో వేపూ వెళ్ళిపోతారు )

# మూడో అంకం

## ఒకటోరంగం : ఉత్తరమైదానం

(విశ్వం వస్తాడు)

విశ్వం:- చుట్టయ్యచెప్పింది నిజమే! ఇంతకన్న చాదస్తం ఉంటుందా? నేను లేవదీసుకుపోబోతున్న పిల్లని నాన్నగారు నాకు బలాత్కారంగా అంటగడతారుట! మా ఇద్దరికీ సంబంధం ఉందని ఆయనకి తెలియగూడదు. ఆయనతో ఎటుపోయినా చిక్కే! నేనుమాత్రం నా వైఖరి మార్చాలి. ఇంత ఆకస్మిక పరివర్తనం ఆయన కాశ్చర్యం కలిగించినా అనుమానంమాత్రం కలగ్గూడదు. అదుగోవొస్తున్నారు, మొహం కందలూర వెదుక్కుంటూ.

(పక్కకి వెళతాడు నిరంకుశం పంతులు వస్తాడు.)

నిరంకుశం:- చచ్చినా వెధవని క్షమించను. చావటమేంటి? మరోయాభై సంవత్సరాలు బతికుండి వేధించుకుతింటాను వెధవని! శాస్త్రిలో నాక్షేపం తెప్పించినంతపని చేశాడే! మూర్ఖుడు, పెడకట్టె, కోపిష్టివెధవ! వీడి కెవరి పోలిక వచ్చినట్లు? మిగిలినపిల్లల కంటె ముందుగా ఈ వెధవను కని, వీడికి చిన్నప్పుడే సైన్యంలో ఉద్యోగం ఇప్పించి, ఏటా అయిదొందలు అదనంగా ఇచ్చినందుకు వీడు నాకు చూపే కృతజ్ఞత ఇదేనా, ఇంక వీడు నాకెవడు. వాడిమొకం ఎన్నటికీ చూడను.

విశ్వం:- ఈ దీనుడి మొహం ఒక్కసారి చూడండి.

నిరంకుశం:- పోరా అవతలికి!

విశ్వం:- నా పశ్చాత్తాపం గమనించండి.

నిరంకుశం:- నువ్వు పొగరుబోతు వెధవ్వి!

విశ్వం:- నిజంగా పశ్చాత్తాప పడుతున్నాను. నేను చాలా పొరపాటు పడ్డాననీ, అన్నివిధాలా మీకు విధేయుణ్ణనీ చెప్పుకోవటాని కొచ్చాను.

నిరంకుశం:- ఏమట్లా ?

విశ్వం- మీరు వెనకనల్లా నన్నెంత బాగా చూశారో, ఎంతదయ చూపించారో ఆలోచించుకున్నాను.

నిరంకుశం:- అయితే ?

విశ్వం:- నాధర్మం గురించీ, విధేయత గురించీ మీరన్నముక్కలు కూడా మననం చేసుకున్నాను.

నిరంకుశం:- ఆఁ, చేసుకుని ?

విశ్వం:- ఇంకేముందండీ ? మీమాట పాలించటాని కెంతత్యాగమైనా చెయ్యాలని తేల్చుకున్నాను.

నిరంకుశం:- అట్లా దారికిరా. ఇప్పుడు నువు సరిగా మాట్లాడు తున్నావు. నిన్నిప్పుడు పేరుపెట్టి పిలిచినా తప్పులేదు.

విశ్వం:- నాకుమాత్రం అంతకంటె కావలసిందేమిటి ?

నిరంకుశం:- అయితే చూడు నాయనా, విశ్వం, నేను నీకు చూపిన పిల్ల ఎవరో చెబుతావిను. పిచ్చివెధవా, నువ్వంత పొగరుబోతుతనం చెయ్యకపోతే నీతో అప్పుడే చెప్పేసి ఉందును. అసలు సంగతివింటే నువ్వానందంలో చిందులు తొక్కేస్తావు. చెప్పెయ్యనా ? నళినిని గురించి నీ అభిప్రాయం ఏమిటి ?

విశ్వం:- నళినా ! ఎవరండీ ఆవిడా ?

నిరంకుశం:- తికమకమ్మగారినీ ఆవిడ మేనగోడలు నళినినీ చూడ లేదురా ?

విశ్వం:- తికమకమ్మా ? నళినా ? విన్నపేర్లుగాలేవే ? ఉండండి, ఉండండి. అన్నట్లా నళినికి మెల్లకన్నుగాదూ ? కొంచెం రాగిజుట్టూ ?

నిరంకుశం:- మెల్లకన్నా ? రాగిజుట్టా ? ఛీ ఛీ !

విశ్వం:- అయితే మరోమనిషయి ఉంటుంది. నేనే పొరబడ్డాను.

నిరంకుశం:- పదహారేళ్ళ బాలకన్య ! అందాలరాశి ! అటువంటి దాని కేమంటావురా, విశ్వం ?

విశ్వం:- అవేమీనేను పాటించను. మీకోర్కె చెల్లించటమే నావిధి.

నిరంకుశం:- అదికాదురా! చెంపకి చారడేసికళ్లు! ఏంకళ్లు: ఎంత అమాయకంగా, బిడియంగా చూస్తుందని! ఆతరవాత ఆ పాలుగారే చెక్కిళ్లు! సిగ్గుపడితే ఎర్రగా కందిపోతాయి! ఆతీర్చిదిద్దిన మూలి! ఆ మూతి నవ్వితే ఎంత అందంగా ఉంటుందో కోపంలో కూడా అంత అందంగా ఉంటుందిసుమా!

విశ్వం:- (స్వగతం) ముసలాయిన చక్కగానే వర్ణిస్తున్నాడు.

నిరంకుశం:- శంఖంలాంటి మెడ! మెడమటుకు మెడ, ఎంతఅందంగా ఉంటుందనుకున్నావు?

విశ్వం:- అయితే నే పెళ్లాడేది మేనత్తనా, మేనగోడలనాండి:

నిరంకుశం:- ఛీ మొద్దు వెధవా? నిన్నుచూస్తే నావొళ్లు మండి పోతోంది. నీవయస్సులో నాదగ్గిర ఏపిల్లనైనా ఇట్లా వర్ణిస్తే అమాంతం ఆకాశాని కెగిరేఉండునే: మేనత్తట, మేనత్త! నేను మీ అమ్మను లేవ దీసుకుపోయిన రోజుల్లో యవ్వనంలో లేనిమనిషి కేసి చూసేవాడిననా?

విశ్వం:- మీ నాన్నగారి ముచ్చట తీర్చటానికైనా చూసిఉండరా?

నిరంకుశం - మానాన్నగారి ముచ్చటా? ఛీ ఛీ: అయినా—మా నాన్న గారు —అవునవును! ఓవేళ మా నాన్నగారు నిర్బంధించిఉంటే—అయినా ఆవిషయం ఇప్పు డనవసరం. మా నాన్నగారు కొడుకును నేను చూసి నంత చనువుగా చూసి ఎరగరు.

విశ్వం:- కావచ్చునులెండి.

నిరంకుశం:- అయితే ఒరే, నీకాబోయే భార్య అదంకత్తె అయి పోయిందే అని నువుగాని దుఃఖపట్టం లేదుగద?

విశ్వం:- నేను మొదటే చెప్పానే! మీకు సంతోషం కలిగించటమే నా కర్తవ్యం. మిగతా సంగతులతో నాకు ప్రసక్తిలేదు. చక్కనిభార్య కావాలని నాకు లేకపోలేదు. కాని మీరు కిందటిమారు గూనీ, అష్టావక్రా, గుడ్డీ అంటూ వర్ణించారు. పెద్దరంభ కాకపోయినా, రెండుకళ్లూ, రెండు

కాళ్లూ, మామూలు వీపూ ఉన్నభార్యే అయితే నే నెంతో సంతోషిస్తాను.

నిరంకుశం:-ఓరి వైరాగి వెధవా! నీ రసికత్వం ఇట్లా నీరుగారి పోతోందేం? నువుచూస్తే సైకిమల్లో చెడబుట్టినట్టున్నావు గాని! ఆపిల్లను నేనే పెళ్ళాడదామా అనిపిస్తోంది, ఆమె చూడగా చూడగా!

విశ్వం:మీ యిష్టంవచ్చినట్టు కానివ్వండి. మీరు మేనగోడల్ని పెళ్ళా డితే నేను మేనత్తను పెళ్ళాడవలిసి ఉంటుందేమో. అట్లాకాక మీరు బుద్ధి మార్చుకుని మేనత్తనే పెళ్లాడదలిస్తే నేను మేనగోడల్ని చేసుకోవ టానికైనా సంసిద్ధుణ్ణే.

నిరంకుశం:-ఒరే, విశ్వం! ఇదంతా దొంగెత్తే! అబద్ధాలాడకు! నిజం చెప్పు, ఇవన్నీ దొంగమాట లవునాకాదా? నాతో నాటకం ఆడు తున్నావా, లేదా? నీ మాటలు దొంగమాటలు కాకపోతే నిన్నెప్పటికీ క్షమించను.

విశ్వం:-మీమీద ఉండే భక్తివిశ్వాసాలను మీరిట్లా అపార్థం చేసు కుంటే నేనేం చెప్పనూ?

నిరంకుశం:-నీభక్తి విశ్వాసా లమకుట్టి-తిన్నట్టే ఉన్నాయి. నువ్వు వెంటనే వెళ్ళి నళినిని చూసిరా. నువ్వొస్తున్నావని తికమకమ్మకు తక్షణం కబురుచేస్తాను. నళినిచూసి నువు కోతిలాగా కుప్పిగంతులు వెయ్యక పోతే ఆపిల్లను నిజంగా నేనే పెళ్లాచేస్తాను. అంతటితో నీరోగం కుదిరి పోతుంది. పద.

## రెండో రంగం: రజని గది.

అనుమానం:-(స్వగతం) ఇంకా రజని రాలేదేమో? శాంతంగా ఆలోచించుకుంటే నా చపలత్వం నాకే ఎంతో అసహ్యంగా ఉంది. ఇంకే విషయంలోనూ లేని అనుమానాలూ, చపలచిత్తమూ ప్రాణసమానమైన రజని విషయంలోనే వస్తుందేం? ఈవిషయంతెలిసికూడా మార్చుకో లేకుండా ఉన్నానే! నన్ను చూడగానే ఆమె కళ్ళలో నిష్కపటమైన

ఆనందం తాండవించింది. ఎంతో ఆప్యాయంగా మాట్లాడింది. చప్పు వెధవను, అంత ఆనందం నేను కనబరచలేకపోయినాను. సమయానికి నిరంకుశం పంతులుగారు దాపరించటంవల్ల నా నోరుకూడా కట్టయింది. కాని నేను లేనిసమయంలో రజని నేను భయపడినంత ఉల్లాసంగా లేదని రూఢీ అయింది. అదుగోవస్తున్నది. ఆ అడుగుల చప్పుడు నేనెరుగుదును.

(రజని వస్తుంది)

రజని:-మళ్ళా ఇంత త్వరలో కలుసుకుంటామనుకోలేదు.

అనుమానం:-మూడోమనిషి లేకుండా నిన్ను కలుసుకోవాలని తహ తహ లాడిపోయాను, రజనీ.

రజని:-నన్నుచూసి మీకు ఆనందం కలగలేదేమోనని ఎంత అనుమాన పడ్డానూ!

అనుమానం:-నాకు నిజంగా ఆనందం కలిగింది, రజనీ! నువ్వు కులాసాగా ఉండటంచూసి నాకానందం కలగదూ? మరోవిధంగా ఎందుకవుతుందీ?

రజని:-అదుగో, మీకేదో సంకోచం కలగనేకలిగింది. ఏమిటో చెప్పి తీరాలి.

అనుమానం:-అయితే చెబుతాను. నేను లేనప్పుడు నీ ఆరోగ్యం గురించీ, నీ ఉల్లాసం గురించీ, పాటలూ, ఆటలూ, జల్సాలూ గురించీ పిచ్చిబాబు చెప్పినప్పుడు నాకు నిరుత్సాహం కలిగినమాట నిజమే. ఇష్టమైనవారిని విడిచిఉన్న సమయంలో సంబరమనేది ఎట్లా వస్తుందో నేనూహించలేను. ఇష్టులను వదిలి వెళ్ళేటప్పుడు మనకంట కారే కన్నీటి చుక్కకు అర్థం ఉండదా?

రజని:-మీలో ఇటువంటి అనుమానం ఎప్పటికీ ఉండవలిసిందేనా? ఎవరో మూఢుడు చెప్పినమాటలు విని నన్నెప్పటికప్పుడు సంశయిస్తూ ఉంటారా?

అనుమానం:-నమ్మను, రజనీ, ఎన్నడూ నమ్మను. ఈ మాటవింటే నా కిప్పుడు చాలా సంతోషంగా ఉంది. నువు ఉల్లాసంగా పాడలేదు గాదూ ? నృత్యంచేసేటప్పుడు కూడా నీ అనుమానం గురించి మరవలేదు గాదూ ?

రజని:-మీరు దగ్గిరలేనప్పుడు నా కానందంలేదు. అటువంటప్పుడు నా మొహంలో సంతృప్తి అనేది కనిపిస్తే దానికి కారణం మీమీద నా కుండే పరిపూర్ణ విశ్వాసమే. అట్లాకాక నేను ఖిన్నవదనం పెడితే అప వాదులకు తావిచ్చినదాన్నవుతాను. నమ్మదగని మనిషిమీద హృదయం నిల్పిందని అంతా నన్నుచూసి శంకించరా ? మిమ్మల్ని తప్పుపడుతున్నా ననుకోకండి, నా విచారాన్ని ఎప్పుడూ చిరునవ్వుమాటున దాచాను. లేకపోతే నా స్నేహితులు నన్నెవరో హింసించినట్టు భావిస్తారని !

అనుమానం:-నువు నిజంగా ఎంత మంచిదానివి, రజనీ. నేనే వొట్టి పశువును. నిన్ను గురించి ఏ కొంచెం అనుమానంమటుకు నాకెందుకు రావాలి ?

రజని:-మీవల్ల ఏ పొరపాటూ జరక్కుండా—అటువంటి పొరపాటె న్నటికీ జరగదనుకోండి—నాకు మీమీద ఉన్న ప్రేమ సూదిమొనపాటి చలించినా నాకంటె కృతఘ్నురా లుండబోతుందా ?

అనుమానం:-కృతజ్ఞత గురించి తెచ్చి నన్ను బాధిస్తున్నావు, రజనీ ! మనిద్దరి మధ్యా ఈ దిక్కుమాలిన కృతజ్ఞత అనేదాని కవకాశం లేకుండా ఉంటే ఎంత బాగుండేది ? అయినా ఒకసారి ఆత్మపరీక్ష చేసిచూసుకో, రజనీ ! ఈ కృతజ్ఞతనే నువు పొరబాటున ప్రేమ అనుకుం టున్నావేమో !

రజని:- మీలో ఏప్రత్యేకగుణంచూసి ప్రేమించాలని మీరనేది ?

అనుమానం:- ఏప్రత్యేకగుణమూ వొద్దు. అట్లా గుణాలుచూసికలిగేది గౌరవం. ఇక బాహ్యసౌందర్యమంటే—నేను కురూపినై ఉండగూడదూ? అప్పుడు నీప్రేమకు నా బాహ్యసౌందర్యంతో ఏమీ సంబంధంలేదని

రుజువై ఉండునుగప!

రజని:- జన్మతహా వచ్చిన అందచందాలనుగురించి ఆతే గర్వించి ప్రయోజనంలేదు. అందచందాల మాటొస్తే మీకన్న కళ్ళకందంగా కనపడే వాళ్ళని నేను చూడకపోలేదు. కాని నా హృదయం నా కళ్ళ నెన్నడూ అనుసరించలేదే,

అనుమానం:- నువ్వాముక్క అనటం నాకు చాలా కష్టంగాఉంది, రజనీ. అందచందాలను నేను పాటించను కాని, నామీద ప్రేమఉంటే నేను నీగ్రోమాదిరిగా ఉన్నా నీ కళ్ళకు నపమన్మథుడల్లేనే కనిపిస్తాం.

రజని:- నన్నేదోవిధంగా బాధించటానికే మీరు నిశ్చయించుకున్నట్టు కనిపిస్తుంది. మనిద్దరికీ పెళ్ళికావాలని మా నాన్నగారు కోరినకోరిక మీ రీవిధంగా ఉపయోగపరుచుకుంటున్నారు.

అనుమానం:- నువ్విట్లా మాట్లాడుతున్నకొద్దీ నా అనుమానాలన్నీ ధృఢమవుతున్నాయి. నే నేదీ దుర్వినియోగపరచటంలేదు—ఓ విధంగా నే నెంతో నిగ్రహించుకుంటున్నాను. నీమటుకు నువు మీ తండ్రిగారిమీద గౌరవం కొద్దీ నన్ను పెళ్లాడాలనుకుంటున్నావు గాని, లేనిపక్షంలో ఇంకా మంచి సంబంధం చూసుకుని ఉండువేమో! నీమీద ఈ వాధ్యతలేకపోయి నప్పటికీ నువు నన్నే నిశ్చలంగా ప్రేమించేదానివని నాకు రుజువేముంది, చెప్పూ?

రజని:- అయితే పరీక్షించరాదా? జరిగిందంతా వొదిలేసి మనిద్దరమూ స్వేచ్ఛావ్యక్తులం అవుదాం. అప్పటికీ నాహృదయం ఆ స్వేచ్ఛను విని యోగపరుచుకోవటానికి ప్రయత్నించదు.

అనుమానం:- చూశావా, స్వేచ్ఛకోసం ఎంత అడుర్దా పడుతున్నావో నీకు నిజంగా నామీద గాఢమైన ప్రేమఉంటే, నేను స్వేచ్ఛనిస్తేమాత్రం నువు తీసుకుంటావా?

రజని:- నన్నెంత ఏడిపిస్తున్నారండీ! నేనిక భరించలేను.

అనుమానం:- నిన్ను బాధించాలని నా అభిప్రాయంకాదు. నిన్నింతగా

ప్రేమించకపోతే నాపిల్ల నీకే బాధా లేకపోను. నేచెప్పేది విను. ఆడవాళ్లు తమప్రేమను విపుల్గా పరీక్షించుకోలేరు; వాళ్లు కృతజ్ఞతనూ, సామాన్య విధినీ ప్రేమకింద గణిస్తారు. అదే నాబాధ. గొప్పకు చెప్పుకోవటం కాదు గాని, వయోగుణరూపాల్లో నా కేమీ లోపంలేదు. ఆడవాళ్ళమతి పోగొట్టే డబ్బు నావగ్గిర లేనేలేదు. రజనీ, ప్రేమ ఔచిత్యంకోసం దేవులాడుతుంటే చూస్తుంటే ఆ ప్రేమకు మూలకారణమేమిటో అని నా కనుమానం పుడుతున్నది.

రజని:- నామీద ఏమి ఆపాదించటానికి ప్రయత్నిస్తున్నారో నా కర్థం కావటంలేదు. కాని మీ ధోరణిచూస్తే నన్నవమానించాలన్నట్టు కనిపిస్తోంది. మీకంత ఇబ్బంది ఎందుకు కలిగించాలి? నన్నిట్లాచెయ్యటం నే నేం తప్పుచేశానని? (ఏడుస్తూపోతుంది)

అనుమానం:- ఏడుస్తోందే! ఆగు, రజనీ! ఒక్క క్షణమాగు!....తలు పేసుకుంది—ఒక్కమాట వినవా, రజనీ?—ఏడుస్తోంది! ఛీ, ఎంత పాపిష్టివెధవని! ఉండు! మళ్ళీవస్తోంది! ఆడవాళ్ళకి బొత్తిగా నిబ్బర మన్నది లేదుకద! రెండు తియ్యనిమాటలకి లొంగిపోతారు! అయ్యో రావటం లేదల్లేఉందే! ఇదుగో, రజనీ! ఒక్క క్షణంరావూ! ఏమీవొద్దు నన్ను క్షమించానని చెప్పి వెళ్లు. ఛాయి! ఇంతమొండితనం పనికిరాదు! ఉండుండు! అదుగో వస్తోంది! నేనప్పుడే అనుకున్నాను వస్తుందని!— పట్టుదల ఉంటేగా? వెళ్ళిపోతున్నట్టు నటించింది. నేను నమ్మినట్టుతెలియ రాదు, నిర్లక్ష్యం నటిస్తాను. (కూనిరాగంతీసి ఆలకిస్తాడు.) ఏదీ, రావటం లేదల్లే కనిపిస్తుందే?— కొంపతీసి రానేరాదేమో! ఇది నిబ్బరంకాదు, వొట్టి మొండితనం, అయినా నాకు కావలిసిందేలే! లేకపోతే ఏమిటి? ఇంతకాలానికి కలుసుకున్నమనిషి అపేక్షను—క్రూరంగా ఇంత అవమా నించటమూ? ఆవిడ మొహం చూట్టానికి మటుకు నాకు మొహం చెల్లు తుందా? ఆవిడకోపం చల్లారేదాకా కనిపెట్టుకుంటాను. ఇంకోసారి బాధిం చానా, ఇక నాకు దిక్కుండ. (పోతాడు)

మూడోరంగం : తికమకమ్మగారిల్లు

(తికమకమ్మ ఉత్తరం చదువుకుంటుంది. కొస్తైను విశ్వం ఉంటాడు)

తికమకమ్మ:- నువు నిరంకుశపంతులుగా రప్పాయివంటేనే నా కెంతో సునాయాసం. ఆపైన నీముఖ చాతుర్యం చూస్తే ఈ ఉత్తరమురాసిన ముక్కలు యధార్థమని తెలుస్తున్నది.

విశ్వం:- నేను మీ మేనగోడలుగురించి ఏమీ ఎరగను గనక ఈక్షణం వరకూ నా తహతహ తికమకమ్మగారితో సన్నిహిత సంబంధం పెట్టుకుందామనే. మీ తెలివితేటలు గురించీ, ప్రతిభనుగురించి వెయ్యినోళ్ళ చెప్పుకోనివారు లేరు.

తికమకమ్మ:- నన్ను చాలా గొప్పచేస్తున్నావు. కూర్చో, నాయనా. అసలీరోజుల్లో ఆడదాని ప్రతిహతాన్ని గౌరవించే మగావాళ్ళేరీ ? ఆడదానికి తెలివితేట లుండాలని కోరేవారేరీ ? అందరికీ దిక్కుమాలిన సౌందర్యమే కావాలి !

విశ్వం:- ఉన్నమాటన్నారండీ. అయితే ఇందులో కొంతవరకు ఆడ వాళ్ళ తప్పుకూడా ఉందంటాను. మొగాళ్ళకు సౌందర్యంమీదే వ్యామోహ మనుకుని చదువు సంధ్యలు బొత్తిగా వొదిలేస్తారు. అందుచేత వాళ్లు పూలమొక్కల్లాగా ఎంతసేపూ మొగ్గ తొడుగుతారేగాని కాయకాయరు. ఈలోగా పూలుకాస్తా రాలిపోతాయి. నారింజచెట్టుల్లాగా పూలశోభా ఫల శోభా కూడా కలవారు బహుకొద్దిమంది.

తికమకమ్మ:- మంచితనంతో చంపేస్తున్నారు, ఇంతపెద్దమనిషితరహా ఎక్కడా చూళ్లేదు. నాయనా, నీకుతెలిసే ఉంటుంది. మా వెర్రిపిల్ల ఒక దిక్కుమాలిన, ఎందుకూ కొరగాని, ఎవరూ ఎరగని ఒక సిపాయిని వరించింది.

విశ్వం:- ఈ సంగతి నా కదివరకే తెలుసు, అది నే నేమంత పట్టించుకోమలెండి.

తికమకమ్మ:-బుద్ధిమంతుడవు! ఈ విషయం నానేత్ర కుహరాల్లో పడ్డప్పటినుంచీ శాయశక్తులా అడ్డుపుల్లవేస్తూనే ఉన్నా. అ వెధవని గురించి ఆలోచించవద్దని దానిమీద తీవ్రమైన నిరసనం పెట్టా. ఇటీవల మీ నాన్నగారు చేసిన ప్రతీకరణకూడా దానికి తెలియజేశా. కాని దురదృష్టవశాత్తూ నేనాపాదించిన ప్రకరణం ఒక్కటీ దానికెక్కకుండా ఉంది.

విశ్వం:-చాలా విచారకరమైన విషయమే.

తికమకమ్మ:-తలుచుకున్నకొద్దీ నేనుభగభగా భగ్నమైపోతున్నాననుకో. వాడికి ఉత్తరాలు రాయటం పరిశ్రమించేసుకుంది గదా అనుకుంటే, ఇవాళే ఓ ఉత్తరం నాకు కరతలామలకమయింది. ఇదుగో దగ్గిరే ఉంది.

విశ్వం:-(స్వగతం) చచ్చాను! నా ఆఖరి ఉత్తరం కాదుగద?

తికమకమ్మ:-(కొంగునుంచి తీసి) ఇదుగో, చూశావా?

విశ్వం:-(స్వగతం) నా ఉత్తరమే! లక్ష్మిముండ ఎంత పనిచేసిందీ!

తికమకమ్మ:-దస్తూరీ గుర్తు పట్టగలవేమో చూడు, నాయనా!

(ఉత్తరం ఇస్తుంది)

విశ్వం:-దస్తూరీ చూసినట్టే ఉంది; ఎవరో నేనెరిగినవాడు రాసినదే!

తికమకమ్మ:-అట్లాకాదు, ఆ సాంతంచదువు మరీ!

విశ్వం:-(చదువుతూ) "నా ప్రాణమా! అత్యంతప్రియురాలా, నళినీ?" ఏమి ప్రేమ!

తికమకమ్మ:-ప్రేమేం? అశ్లీలంకూడానూ!

విశ్వం:-"నువు రాసిన వార్తవిని నేను చాలా కంగారుపడ్డాను. విశేషించి ఎందుచేతనంటే నాతో పోటీకొస్తున్నవాడు——"

తికమకమ్మ:-అంటే, నువ్వన్నమాట.

విశ్వం:-" చాలా ప్రతిభావంతుడూ, పెద్దమనిషీనూ," పోనీ, ఆపాటైనా మర్యాద నిలిపాడు.

తికమకమ్మ:-ఎట్చే, ఆ మాట అనటంలోకూడా ఏదో దురుద్దేశం ఉంటుంది.

విశ్వం:-దురుద్దేశం ఉందని నేనూ ఒప్పుకుంటాను.

తికమకమ్మ:-అసలు సంగతి ముందుంది. చదువు.

విశ్వం:-"నిన్ను చెరలో ఉంచిన ముసిలితొక్కు లంకిణీముండ ఉందే—" ఎవరిని గురించి అంటున్నాడబ్బా ?

తికమకమ్మ-నేనే నాయనా ! ఇంకెవరూ ? నన్నే అంటున్నాడామాట! ఇంకా చదువు.

విశ్వం:-ఓరి వెధవా ! "ఆవిడ కన్ను కప్పటం కష్టమైనా నేను ఏవో తంటాలు పడగలను. ఎందుచేతనంటే, తన ముసలితనాన్ని అలంకారాల కింద మరుగుపరుచుకుంటూ, తన చొప్పదంటు సంభాషణలో తనకే అర్థంగాని కఠినపదా లుపయోగించే చాదస్తం ముండ—"

తికమకమ్మ:-చూశావా నా భాష నెట్లా ఎత్తి పొడుస్తున్నాడో ! దీనికే మంటావో చెప్పు ! నా నామవాకాచాల కిటువంటి అవమానమా ? మర్యాదతెలీని పశువు ! నేను నిజంగా వశీకరణచేసుకున్నదేమైనా ఉంటే అది నా వాక్చాపల్యమూ, భాషాప్రయుక్త విశేష్యమూనూ.

విశ్వం:-వాణ్ణి నరికి పాతరేసినా పాపంలేమటెంటి ! ఇంకేమంటాడూ ? "చాదస్తం ముండ"—

తికమకమ్మ:-ఆమాట పదేపదే చదవాలా ?

విశ్వం:-క్షమించండి—"మెప్పులకూ, ప్రశంసలకూ మోసపోక పోదు. అందుచేత ఈ వృద్ధజంబుకం అనుమతితో నేను నిన్ను చూడ టానికి రాగ లందుల కొకఉపాయం ఆలోచించాను. ఆవిడచేత నేను మనిద్దరిమధ్యా మధ్యవర్తిత్వంకూడా చేయిస్తాను, చూడు తమాషా." ఏం పొగరూ !

తికమకమ్మ:-ఇంత ఘోరం ఎక్కడన్నా ఉందా ? నన్ను కన్ను గప్పుతాడేం ? కాదు మరీ ! హహ్హాహ్హా ! ఈ ఇంటో ఎట్లా అడుగుపెడ తాడో నేను చూస్తానుగా ! ఎవరిది పెద్దపేచీ అయిందీ చూస్తాంగా !

విశ్వం:-చూస్తామండి, తప్పకుండా చూస్తాం ! హహ్హాహ్హా ! దొంగ

ఘుండా కొడుకు! హాహ్హాహ్హా! అయితే, తికమకమ్మగారూ, ఓ పనిచేస్తే బాగుండదూ? మీరు, మీ అమ్మాయ్మని, ఏమీ ఎరగనట్టు ఉత్తరాలు రాయ నివ్వండి: వాడంటే ఆమెకంత మోజుగా ఉంది గనక వాడితో లేచి పోవటానిక్కూడా అవకాశం ఇవ్వండి! తీరా లేచిపోతుండగా నేను వాడి కడ్డుపడి, వాడికి పరాభవంచేసి, వాడి బదులామెను నేనే ఎత్తుకుపోయి పెళ్ళాడేస్తాను. అట్లాచేస్తే?

తికమకమ్మ:-ఈ ఉపాయం బాగుంది. ఇంతకంటె కృతకమైన ఉపాయం ఉండబోదు.

విశ్వం:-ముందు నేనామెను కాస్సేపు చూడటానికి వీలవుతుందా? ధోరణి ఎట్లా ఉందో చూతామని.

తికమకమ్మ:-ఏమో, మరి! చూట్టానికొప్పుకుంటుందో ఒప్పుకోదో. ఇటువంటి విషయాలో ఓ విధానం ఉంది.

విశ్వం:-ఎబ్బే, నన్ను చూడటానికేమీ అభ్యంతరం చెప్పదులెండి. మీరు వెళ్ళి శృంగారం వచ్చాడని——

తికమకమ్మ:-ఏ—మి—టీ!

విశ్వం:-(స్వగతం) నానోరుపడా!

తికమకమ్మ:-శృంగారం సంగతి ఏమో అంటున్నావే!

విశ్వం:-మీరు వెళ్ళి వేళాకోళానికి, "నీకోసం శృంగారం వచ్చా"డని అంటే పరిగెత్తుకుంటూ వస్తుందన్నాను. హహ్హహ్హా!

తికమకమ్మ:-దాని తిక్క అట్లాగే అణిగించాలి. నాద్వారా తనను చూస్తానని వాడు రాశాడుకూడాగా! హహ్హహ్హా! ఎట్లాచేస్తాడో చూడలేక పోతానూ?——నళినీ, ఓమారిట్లా వస్తావా?——నన్ను మధ్యవర్తిని చేస్తాడుగా? హహ్హహ్హా! ఇదుగోనేవ్ నళినీ, కిందికిరా! నువ్వేమిటి, నాయనా? హహ్హహ్హా! వాడిపొగరు కెవరైనా నవ్వుతారు.

విశ్వం:-పొగరా, పొగరా! హహ్హహ్హా!

తికమకమ్మ:- మొండిపిల్ల, నామాట వినిపించుకోదు. నేనేవెళ్లి దాంతో

కాప్టెన్ విశ్వం వచ్చాడని చెప్పిపంపిస్తాను. ఎందుకురాదో చూస్తాను!

విశ్వం:- మీయిష్టం!

తికమకమ్మ:- అయ్యో ఇంకా నువు నవ్వుతూనే ఉన్నావా? నన్ను కన్నుగప్పుతావ్లు! అవునవును! హహ్హాహ్హా! (పోతుంది)

విశ్వం:- నళినితో యథార్థం చెప్పెయ్యటానికిదిమంచి అవకాశం. కాని, పెంకెమనిషి, నిజంచెప్తే అసలే దక్కకుండా పోతుందేమో. నన్ను గుర్తిస్తుందేమో చూతాం! (పక్కకి వెళ్ళి ఏవో బొమ్మలు చూస్తుంటాడు)

(నళిని వస్తుంది)

నళిని:- ఇదో తద్దినం. ఇష్టంలేని మనిషి చేసే హృదయాలాపనలు వినటంకంటె చికాకైనసంగతిలేదు. ఇటువంటివాళ్ళను వొదిలించుకోవ టానికి మంచితనంగా పోయినా పని జరగొచ్చు. ఆ ఉపాయమే పీడి దగ్గిర అవలంబిస్తాను. అదుగో, అక్కడే ఉన్నాడు భ్రష్టుడు. ఉద్యోగస్తుడు కూడాను. నా శృంగారానికీ వీడికీ ఏమిటి సాపత్యం? చాలా చిత్రంగా ఉందే వ్యవహారం? ఇటు కేసి చూణ్ణన్నా చూడడు! నేనే పలకరిస్తాను. విశ్వంగారూ?

విశ్వం:- (వెనక్కు తిరిగి) ఏమండీ?

నళిని:- నువ్వా. శృంగారం?

విశ్వం:- ష్! అరవకు! కొంపపోతుంది.

నళిని:- నాకెంతో ఆశ్చర్యంగాఉంది. భయమేస్తున్నది. సంతోషంగా ఉంది! నువ్విక్కడి కెట్లావచ్చావ్?

విశ్వం:- మీ అత్తకి టోపీచేవేశాను. నా ప్రత్యర్థి ఇక్కడికి వస్తాడని విని, వాడికేవో ప్రతిబంధకాలు కల్పించి, వాడి బదులు నేనే వచ్చి, మీ అత్తతో నాపేరు విశ్వమని చెప్పేశాను.

నళిని:- భలే! మా అత్త నమ్మిందా?

విశ్వం:- నమ్మ కేంజేస్తుంది?

నళిని:-ఆవిడ అమాయకత్వం చూస్తే నాకు నవ్వొస్తోంది! హహ్హహ్హ!

విశ్వం:-మాట్లాడుతూ కూర్చోటానికి సావకాశం లేదు. ఈ ముసలి దాని పీడవదిలించుకుని నా దగ్గిరి కెప్పుడొచ్చేస్తావో చెప్పు త్వరగా.

నళిని:-అయితే మరి మనప్రేమ పానకంలో పుడకలావున్న నా ఆస్తికి తిలోదకాలేనా?

విశ్వం:-నాకు నీ అందంచాలదా, నళినీ! అదే లక్షలూ, కోట్లూనూ! అంతకంటె అధికమైన కట్నం ఆశించటానికి నాదగ్గిరమటు కేముందీ?

నళిని:-ఎంత తియ్యగా చెబుతావ్? నీతో దరిద్రం అనుభవించటం కంటె వేరే సుఖం ఉంటుందా?

విశ్వం:-నళినీ, మన జీవితం ఎంత ఆదర్శప్రాయంగా ఉంటుందీ! మన కారాధించేటందుకు ప్రేమ దేవత తప్ప మరోటి ఉండదు. ఐహిక సుఖాలన్నీ వొదిలేసుకుని ఆ దేవతను శ్రద్ధాభక్తులతో ఆరాధింతాం. కష్టాలకు గర్వింతాం. దారిద్ర్యంచూసి తన్మయు లవుదాం. దారిద్ర్యాంధకారంలో మన ప్రేమజ్యోతి మరింతగా వెలుగుతుంది. నాకున్న కాస్త పాటి డబ్బూ దస్కమూ అవతల పారేసి నా నళిని ఆలింగన సౌఖ్యమే వ్రతంగా పెట్టుకుంటాను. (నళినిని కౌగలించుకుని, స్వగతం) ఒప్పుకుందంటే చచ్చుపొత్తే!

నళిని:-ఇటువంటి వాడితో ఎడారిలో ఉంటేమటు కేం. అయితే నా కష్టాలన్నీ ముందున్నై.

(ఆలకిస్తూ తికమకమ్మ వస్తుంది)

తికమకమ్మ:-(స్వగతం) మొండి కొరివి, ఏం అల్లరిచేస్తోందో!

విశ్వం:-మాట్లాడవేం, నళినీ! నీ ఉద్రేకం చల్లారిందా అప్పుడే?

తికమకమ్మ:-(స్వగతం) ఉద్రేకమంటున్నాడే! దీనికావేశం వచ్చిందా ఏం?

నళిని:-లేదు. లేదు. నాజన్మలో అది చల్లారుతుందా?

తికమకమ్మ:-(స్వగతం) దీని ఆవేశంమండా! బతికున్నన్నాళ్ళూ దీని కాగ్రహమే?

నళిని:-మా అత్తయ్య చెప్పే బొల్లిమాట లొక్కనాటికి వింటా ననుకోకు.

తికమకమ్మ:-ఏం వినయ విధేయతలు!

నళిని:-ఆవిడ విశ్వాన్ని పట్టుకువేళ్ళాడనీ, నేను మాత్రం నా శృంగారాన్ని వదలను.

తిక:-దీని సాహసం మండా! వాడి మొహానే అనూటంటూంవే!

విశ్వం:-అయితే నా ప్రార్థన విను.

తికమకమ్మ:-అయ్యో, వీడు ప్రాధేయపడుతున్నాడు. నా వొళ్ళుమండి పోతోంది!....ఒసే, కొరివికానా, నేనంతా విన్నాను.

విశ్వం:-(స్వగతం) ఈ ముండ వదలదేం?

తికమకమ్మ:-విశ్వం, నా మేనగోడలు మోటుతనంచూసి నాకు చాలా సిగ్గుగా ఉంది.

విశ్వం:-(స్వగతం) బతికించింది! నిజమింకా తెలుసుకోలేదు. (పైకి) ఫరవాలేదులెండి. మీ అమ్మాయి మనస్సు కాలక్రమాన మారుతుందని నాకాశగా ఉంది.

తికమకమ్మ:-లాభంలేదు, నాయనా. దానితల పొట్టి ఉల్లిపాషాణం. చెబితే వినే మచ్చుకాదు.

నళిని:-నేనిప్పుడు నీ మాట ఏం వినలేదా?

తికమకమ్మా:-ఓసి రాకాసీ! నువ్విప్పుడే ఈ పెద్దమనిషితో, నీ మనస్సు మరోడిమీద ఉందనీ, ఇతన్ని పెళ్ళాడననీ అనలేదటే?

నళిని:-నేనటువంటి దేమీ అనలేదు.

తికమకమ్మ:-ఏం నంగనాచివే! అట్లా బుద్ధొచ్చొచ్చుటే? నువ్వు శృంగారంగాణ్ణి—ఆ చచ్చు వెధవని కోరుకున్నట్టు చెప్పలా? ఆమాట చెప్పుముందు.

నళిని:-అవును, నిజమే ! నేను శృంగారాన్ని—

తికమకమ్మ:-చాల్లే ఊరుకో ! ఎవరన్నా వింటే నవ్విపోతారు.

విశ్వం:-అననివ్వండి. నాకేమీ కష్టంలేదు. నిజంగానే !

తికమకమ్మ:-అయ్యో, ఎంత మంచివాడివి, నాయనా ! ఎంత అమాయకుడివి ! నువ్వు, పదవే ముందిక్కణ్ణుంచీ !—మళ్ళా కనిపించు నాయనా, విశ్వం ! మన మనకున్న మాట మరవకు.

విశ్వం:-సరేలెండి!

తికమకమ్మ:-ఆ పెద్దమనిషి దగ్గిర సెలవు తీసుకో.

నళిని:-నా శృంగారానికి శుభంకావాలి. నాశ్యం—

తికమకమ్మ:-నీ అంకితభ్యనొక్కా ! పద, పద ! (వెళ్ళిపోతారు)

## నాలుగో రంగం : పిచ్చిబాబు బస.

(అప్పుడే దుస్తులు వేసుకుని పిచ్చిబాబూ, సూరన్నా ఉంటారు).

పిచ్చిబాబు:-ఇప్పుడు చాలా బాగున్నానుగాదురా, సూరన్నా.

సూరన్న:-పూర్తిగా మారిపోయినారండి.

పిచ్చిబాబు:-గుడ్డల్లో ఎంత ఉందిరా !

సూరన్న:-అంతా అందులోనే ఉందండి. ఇప్పుడు మీరింటికి పోతే పెద్దమ్మగారు గుర్తించలేరండి. పంట పంతులుకూడా గుడ్లు మిటకరిస్తాడు. పనిజేసే ఎల్లి "అమ్మయ్యో" అని ఒకగావుకేకెట్టి యిరుసుకుపడిపోద్ది. సుట్టుపక్కలుండే కుక్కలన్నీ మొరిగేస్తయ్. మన సొంత కుక్కకూడా తోకాడిస్తదనుకోనండి.

పిచ్చిబాబు:-అవునురా, సూరన్నా. కాస్త మెరుపవసరం.

సూరన్న:-బూటుకు రంగేసే కుర్రాడితో ఆమాటే అంటానండి. ఆ సచ్చి నాడినిపించుకుంటేగా ?

పిచ్చిబాబు:-నాకు ఉత్తరాలేమైనా వచ్చాయేమో కనుక్కొస్తావుగాదూ

సూరన్న:-యెళ్తానండి....తల ఐం ఫసందుగుందండి. నేనే అప
ర్చాను గనక తెలుస్తా వుందిగాని లేకుంటే నేను గుర్తించనా?

(సూరన్న పోతాడు)

(నౌకరు వస్తాడు)

నౌకరు:- తమకోసం కయ్యం పంతులుగా రొచ్చారండి.

పిచ్చిబాబు:- లోపలికి రమ్మను. (నౌకరు పోతాడు)

(కయ్యంపంతులు వస్తాడు)

కయ్యం:- నమస్కారం.

పిచ్చిబాబు:- నమస్కారం. దయచెయ్యాలి.

కయ్యం:- తలవని తలంపుగా వేంచేసినట్టున్నారే?

పిచ్చిబాబు:- ఒకచిన్న ప్రణయకార్యం చక్కబెట్టుకుందామని వచ్చి ఊబిలో చిక్కుకున్నాను. నాకు చాలా అన్యాయం జరిగింది, పంతులుగారూ. వివరా లనవసరంగాని నన్నొక అన్యాయం జరిగిన మనిషికింద మటుకు జమకట్టెయ్యండి.

కయ్యం:- వివరా లడుగుతున్నా ననుకోకండి. ఏంజరిగిందేం?

పిచ్చిబాబు:- చూడండి, కయ్యంపంతులుగారూ. నేనొక చిన్నదాన్ని యథోచితంగా ప్రేమించాను. ఆవిడ విహితులంతా నన్ను ప్రోత్సహించారు. ఆవిడ వెనకాతలే నేనూ ఈ వూరొచ్చాను, నారాక ఎరిగించాను. అపిల్లను అన్యత్రా ఇవ్వబోతున్నట్టు జవాబొచ్చింది. ఇది అన్యాయమా, కాదా చెప్పండి, పంతులుగారూ?

కయ్యం:- అన్యాయమా, అన్యాయమా? దీనికంతకీ మూలకారణం ఏమైఉంటుందంటారు?

పిచ్చిబాబు:- అదే నేనంటున్నది. శృంగారమని మరో డాపిల్లనావేశించాడట. వాడిప్పు డిక్కడే ఉన్నట్టు తెలిసింది. వాడే దీనికంతకీ కారణమై ఉండాలి.

కయ్యం:- అట్లా చెప్పండి. మీ సొత్తు మరోడు అక్రమంగా స్వాధీన పరుచుకున్నాడన్నమాట.

పిచ్చిబాబు:- అక్రమంగా కాకపోతే క్రమంగా స్వాధీనంచేసుకోవటం వాడితరమా ?

కయ్యం:- అయితే ఇంక నేను చెప్పేదేముంది? కర్తవ్యం మీ రెరుగుదురుగా ?

పిచ్చిబాబు:- నాకేమీ తెలీదే ?

కయ్యం:- అదేమిటండీ? మీ మానరక్షణ మాకు తెలీదా ఏమీటి ?

పిచ్చిబాబు:- వాడితో పోట్లాడమన్నగవ, కొంపతీసి?

కయ్యం: ఇంకా అడుగుతారేం ?

పిచ్చిబాబు:- వాడు నాజోలికి రాండే ?

కయ్యం:- మీజోలికి రాకపోవటమేటి ? మీకు తీరని అవమానం చేశాడు. మీరు ప్రేమించిన పిల్ల మీద కన్నువెయ్యటంకంటె మిత్రద్రోహం ఉండబోదు.

పిచ్చిబాబు:- మిత్రదోహమయితే సరే ననుకోండి. వీడితో నాకు పరిచయమైనా లేదే! నేను వాణ్ణి చూడనైనాలేదు.

కయ్యం:- దాని కెవరు బాధ్యులు? అంత ఎరగని మొహమయితే మీ జోలి కసలే రాగూడదూ!

పిచ్చిబాబు:- అది నిజమే, పంతులుగారూ! నాక్కోపం వచ్చేస్తూంది! నాకు మరీ వొళ్లు మండిపోతుంది! నాలో ఇంత శౌర్యం ఉండికూడా నాకే తెలీకపోవటం విచిత్రంగా ఉంది. అయితే నాపక్షానకూడా కొంత న్యాయం ఉండేట్లు చూసుకోవటం సబబేమో ?

కయ్యం:- పిచ్చివాడా, న్యాయాన్యాయంతో పనేమిటి? మానహాని జరిగినప్పుడు! రాముడుగాని, అర్జునుడుగాని న్యాయం విచారిస్తూ కూర్చున్నారా? విల్లు సంధించారు! అంతే న్యాయాన్యాయాలన్నీ వాల్మీకి వ్యాసాదుల నిర్ణయానికే వొదిలేశారు.

పిచ్చిబాబు:- అహా! మీమాటలు నాకింజక్షనులా పనిచేస్తున్నై. ధైర్యం కూడా ఓ అంటువ్యాధినుమండీ! నాలోంచి ఓ విధమైన ధైర్యంలాంటిది పొంగుకొస్తోంది—ఓ విధమైన పరాక్రమం అనుకోండి! సుంయ్, టాప్, ఫాట్! మొగాడైతే రమ్మనమని ఇవాళే కబురుచేస్తాను.

కయ్యం: మా వంశంలో చూడండీ, ప్రత్యర్థిని పొట్టబెట్టుకోని వాడు లేడు. మా మాన్యాలన్నీ మంటగలసినా నాకు చక్కని వారసత్వం లభించింది.

పిచ్చిబాబు: మా పూర్వీకులు మటుకు తక్కువ తిన్నారా? అంతా కత్తి పట్టినవాళ్లే. ఇకచెప్పకండి. నేను లేచాను మరి! మీమాటల హుంకారానికి నాహృదయం చెమ్మరించింది. దశ్శరథా, తోలుబొమ్మల్లో హనుమంతు డన్నట్టు, "ఓరీ రావణాధమా—"

కయ్యం:- కాస్త తమాయించుకో. ఇటువంటి విషయాల్లో ఆవేశం కూడదు. పెద్దమనిషి తరహాకు భంగం రారాదు.

పిచ్చిబాబు:- నా కావేశంకావాలి, పంతులుగారూ! చచ్చేంత కోపం కావాలి. దయచేసి నన్ను కోప్పడ్డివ్వండి, అభ్యంతరం చెప్పకండి. ఏదీ కాగితం, కలం. (కూర్చునిరాయటానికి ఉపక్రమిస్తూ) ఎర్రసిరా లేక పోయెనే! ఏదీ? ఎట్లా ప్రారంభించమన్నారూ? పెద్దక్షరాలు రాయనా? తప్పదియ్యా!

కయ్యం:- కాస్త, తమాయించుకోవాలి.

పిచ్చిబాబు:- కానివ్వండి, ఏదో? ఓతిట్టుతో ప్రారంభించనా? ఛ అనే మాటతో ప్రారంభించనివ్వండి, పంతులుగారూ!

కయ్యం:- చాల్లే, ఊరుకోవయ్యా! పెద్దమనిషితరహాగా "అయ్యా" అని సంబోధించు.

పిచ్చిబాబు:- అంత మర్యాదే?

కయ్యం:- "మన యిరువురమూ ఒకేస్త్రీని ప్రేమించినందువల్ల"—

పిచ్చిబాబు:— "నందువల్ల"—

కయ్యం:- "ఏర్పడిన అభిప్రాయ భేదాన్ని పరిష్కరించుకొనుటకు గాను"—

పిచ్చిబాబు:- "కొనుటకుగాను"—

కయ్యం:- ఏదీ, చూడనీ. తూర్పుతోట అయితే వీలుగా ఉంటుంది. రాయి— "తూర్పుతోటలో నన్ను కలుసుకొనవలిసిందిగా ఆహ్వానిస్తున్నాను."

పిచ్చిబాబు:- వెధవని, విందుకు పిలుస్తున్నానా?.... అయిపోయింది. దీన్ని త్వరలోనే వాడి కందజేస్తాను.

కయ్యం:- ఈకాస్త చీటీ ముక్కతో మీ ఇద్దరిమధ్యా ఉండే అభిప్రాయభేదాలన్నీ పరిష్కారం అయిపోతాయి.

పిచ్చిబాబు:- అవును, ఏకాభిప్రాయానికి రాగలందులకు కొట్టుకుంటాం.

కయ్యం:- నీకు వీలయిన సమయం నువే నిర్ణయించుకో. నన్నడిగితే ఈ సాయంకాలమే ఇది పరిష్కరించుకో మంటాను. మళ్ళీ రేపుదయానికి మనస్సు నిశ్చింతగా ఉంటుంది.

పిచ్చిబాబు:- నిజంకూడాను.

కయ్యం:- సరే, నేను సాయంకాలందాకా నీకు కనిపించను. నేను కూడా ఒక కాప్టెనుతో చిన్నతగూ పరిష్కరించుకోవలసినట్టు కనిపిస్తుంది. అతను మాజిల్లానుగురించి హేళనగా మాట్లాడినట్లు విన్నాను. అతన్ని దగూకుపిలవటంకోసంగాను అతని పరిచయం చేసుకోవాలి.

పిచ్చిబాబు:- ఇంకేం. మీరు ముందు మీ ప్రత్యర్థిని చంపిపారెయ్యండి. నాకూ కొంత నేర్చుకున్నట్టవుతుంది.

కయ్యం:- ఓ, చాలా విషయాలు నేర్పుతాను—నేను వెళ్లొస్తాను. ప్రత్యర్థితో మొరటుగా మాట్లాడకు, నీ కత్తిలాగే నీ ప్రవరన కూడా నిర్దుష్టంగా ఉండాలి. (చెరోపక్క వెళ్ళిపోతారు.)

# నాలుగో అంకం

## ఒకటోరంగం: పిచ్చిబాబు బస.

(పిచ్చిబాబూ, సూరన్నా)

సూరన్న:- ఎవరో కయ్యంపంతులుగారు చెప్పారని ఇష్టంలేని తగూలు పెట్టుకుంటారుటండీ? ఇంటికాడ మీ అమ్మగారికి తెలిస్తే ఏమంటారు

పిచ్చిబాబు:- ఒరే, సూరన్నా. ఆ కయ్యంపంతులుగారి మాటలు వింటే నీ కెంతశౌర్యం వచ్చిఉండే దనుకున్నావు?

సూరన్న:- తీసెయ్యండి. నాకు రగతమంటే కళ్లుబైరలు గమ్ముతాయి. కుస్తీలో పేచీలో, పిల్లిమొగ్గలో అయితే. పోనీ ఆమటా అనుకోవచ్చు. కత్తులెట్టి పొడుసుకుంటారుటండీ, ఎందుకొచ్చిందీ?

పిచ్చిబాబు:- నామానంరా, నామానం. దాన్నిగురించి నేను శ్రద్ధపడాలి.

సూరన్న:- మంచిమాటేనండి. నన్నుగురించి నా మానంకూడా పెద్ద గానే ఉండాలండి!

పిచ్చిబాబు:- పెద్దమనిషి మానం పోగొట్టుకుంటాడ్రా?

సూరన్న:- మానమే పెద్దమడిసిని పోగొట్టుకుంటే అదేమంత గన మండీ: ఈ మానం కొంపల్దీస్తదండీ! నేనే ఓ పెద్దమడిసి ననుకోండి.. మాటొరసకి. అప్పుడు నామానం నన్నేమంటదీ? ఎవరితోనో పోట్టాడ్రా అంటది. పోట్టాడతాను. నేనే అవతలోణ్ణి సంపేసినాననుకోండి. మా బాగా ఉంటది. కానీ కీర్తెవరికీ? నామానానికి ఓయాల నేనే సచ్చినా ననుకోండి. నా ప్రాణం కాస్తాపోద్ది. నాశరీరం పురుగులపా లవుద్ది. కీర్తెవరికీ? అవతలోడికేగదంటండీ?

పిచ్చిబాబు:- అట్లా కాదురా. చచ్చినా నీదేకీర్తిరా!

సూరన్న:- సచ్చిపొయ్యేవోడికి కీర్తిలేకుంటేమటు కేమండీ?

పిచ్చిబాబు:- ఛీ. పిరికిపందా! నీమాటలు వినటం నా శౌర్యానికి హాని.

నాతాత ముత్తాతల కపఖ్యాతి తెమ్మంటావురా? నా తాత ముత్తాతలగౌరవం సంగతేమంటావు ?

సూరన్న:- సాధ్యమైనంతవరకు ఆరి కెడంగా ఉండటమే ఆరికి గౌరవ మండి. తొందరపడి ఆర్ని చేరుకోవటం ఏమంత మేలయిన పనిగాదండి. మనతాతలు చాలా మంచోరేకావచ్చు గానండి, వారితో మనకి పొత్తు కలవదండి.

పిచ్చిబాబు:- ఒరే, అయితే ఇందులో అంత తీవ్రమైన—ప్రమాద మైన— అపాయకరమైన విషయం ఉందంటావా ? పోట్లాడుకున్న వాళ్ళంతా చచ్చిపోతార్రా ?

సూరన్న:- ఎటుబో యెటొచ్చినా ప్రాణాలమీద ఆశొదులుకోవటమే మేలండి. అవతలోడు మదాయించి పొగరుబోతుగా ఉంటాడండి. ఒక్క- యేటేశాడంటే యాడతగిల్నా మొప్పమేనండి. అమ్మో, తలుసుకుంటేనే నాకు వొళ్లాణికి పోతావుంది. కత్తులూ కటార్లంటే మాటలాండి దూసుకు పోతై, సించి పారేస్తాయండి. మాటలా ?

పిచ్చిబాబు:- ఛా ! నే చచ్చినా భయపణ్ణు! తప్పదిమ్యా, నీమాటలు న న్నేమీ భయపెట్టలేవు. ఏమనుకున్నావో! ఇదుగో, ఉత్తరంరాసి వెట్టాను. నాస్నేహితుడు విశ్వం చేతపంపిస్తాను.

సూరన్న:- ఆరిచేతే పంపియ్యండి. నాకుమట్టు కిందులో జోక్యం వొద్దు. నాకా ఉత్తరం చూస్తేనే భయం యేత్తావుంది. సూడండి నిప్పులు గక్కుతా ఎట్టాఉందో!

పిచ్చిబాబు:- నువు నిజంగా వొట్టి పిరికివెధవ్వి.

సూరన్న:-సరే, నేసెయ్యగల్గిందంతా సేసేశాసూ. రేపీపాటికి మనింటి కాడ అందరూ గొల్లుమంటా వుంటారు. మన పెంపుడుకుక్క యీ మా టినేతలికి కంయో మనేడుస్తది. పాపం. దాని కిప్పుడేమి తెలీదుగద! మిమ్మల్ని సిన్నప్పుటాల్నుంచీ యెత్తి మోసిన ముసలాయి మూలా పేడుస్తాడు. (పడవ మొదలుపెడతాడు)

పిచ్చిబాబు:- నీ ఏడుపులు చాలించువెధవా. నేను మాటతప్పేవాణ్ణికాను.

(నౌకరు వస్తాడు)

నౌకరు:- కాప్టెను విశ్వంగారండి,

పిచ్చిబాబు:- పైకిరమ్మను. (నౌకరుపోతాడు)

సూరిన్న:- బగమంతుడి దయవల్ల రే పీతలి కందరి పాణాలూసల్ల గుంటే—

పిచ్చిబాబు: ఓరే, సూరన్నా, నా కొళ్ళు పండిపోగల్దు జాగ్రత్త.

సూరన్న:- నాకు సెలవిప్పియ్యండి.

పిచ్చిబాబు:- పోరా పిరికిమొహమా, శకునపక్షి. (సూరన్నపోతాడు)

(విశ్వం వస్తాడు)

విశ్వం:- ఏమిట్రా, విశేషం, బాబూ?

పిచ్చిబాబు:- వొట్టి పిరికిపెధవ! నాలో ఎలుగ్గొడ్డు సాహసమూ, ఖాట సారి ధైర్యమూ కూడా ఉండబట్టే సరిపోయిందిగాని—

విశ్వం:- నన్నెందుకు పిలిపించావన్నాను.

పిచ్చిబాబు:- అదా? ఇదుగో, చూడు. (ఉత్తరం చేతికిస్తాడు)

విశ్వం.- "సిపాయి శృంగారంగారికి —" (స్వగతం) ఇదాసంగతి? ఏమిటుందిందులో? (పైకి) ఏమి టిదంతా?

పిచ్చిబాబు:- తగూ!

విశ్వం:- నువ్వు వీడితో పోట్లాడుతావుట్రా?

పిచ్చిబాబు:- ఎందుకు పోట్లాడనురా? కయ్యం పంపులొచ్చి నాకు బాగా పురెక్కించి వెళ్ళాడు, నాకు భలే వేడెక్కిపోయింది. ఇదంతా ఎందుకు వృథాగా పోవాలని ఇవాళ సాయంకాలమే యుద్ధానికి సిద్ధపడ్డా.

విశ్వం:- నన్నెందు కిందులో ఇరికిస్తున్నావ్?

పిచ్చిబాబు:- నువ్వొకవేళ వీణ్ణెరుగుదువేమో గనక వీణ్ణి పట్టుకుని ఈ ఉత్తరం అందజేస్తావని.

విశ్వం:- అయితే నాకిచ్చెయ్యి. వాడికి చేరినట్టేలే!

పిచ్చిబాబు:- నిజంగా స్నేహితుడంటే నువ్వేరా, అయితే, పాపం నీకు శ్రమకలిగిస్తున్నానేమో.

విశ్వం:- ఒక్కనాటి కట్లా అనుకోకు. నాకేమీ శ్రమలేదు.

పిచ్చిబాబు:- స్నేహితులకన్న ఎక్కువైం దేముంది? అయితే, విశ్వం, నాకు తోడొస్తావా?

విశ్వం:- ఈవిషయంలో మటుకు నన్నొదిలెయ్యి. భావ్యంగాఉండదు.

పిచ్చిబాబు:- సరేపోనీ, కయ్యంపంతు లుంటాడులే.

(నౌకరు వస్తాడు)

నౌకరు:- నిరంకుశం పంతులుగారు తమ అబ్బాయిగా రున్నారా అని అడుగుతున్నారండి.

విశ్వం:- ఇప్పుడే వచ్చాననిచెప్పు. అయితే, బాబూ, నేనెళ్లొస్తానురా, నీ ప్రయత్నం సఫలమవుగాకా!

పిచ్చిబాబు:- ఉండు, ఉండరా, విశ్వం. ఈ శృంగారరంగాణ్ణి చూసి నప్పుడు నన్నుగురించి అడిగితే మాంచి ధైర్యసాహసాలుగల వాణ్ణని చెప్పేం?

విశ్వం:- ఓ. తప్పకుండానూ! నీది మొసలిపట్టనికూడా చెబుతాను.

పిచ్చిబాబు:- చెప్పు, చెప్పు, దాంతో వాడు కాస్తా హడలి చచ్చిపోయి కయ్యానికి రావడమే మానేస్తాడు. వారాని కోణ్ణి పొట్టనపెట్టుకుంటానని చెప్పేం?

విశ్వం:- చెబుతాను. మీ ఊళ్లో నువ్వు పేరుమోసిన రౌడీవనికూడా చెబుతాను.

పిచ్చిబాబు:- ఛేష్, ఆపనిచెయ్యి, ఎందుకొచ్చినపీడ? వీలయినంత శాంతంగాపోతే బాగుంటుంది, నామర్యాద కాపాడుకోవాలనే కాని వాడి ప్రాణంతీస్తే నాకేం దొరుగుతుంది?

విశ్వం-నిజమేలే. నువు బుద్ధిమంతుడివి.

పిచ్చిబాబు:- వాణ్ణి చంపెయ్యమని నువు సలహా ఇవ్వావు కదూ, విశ్వం?

విశ్వం:-ఎబ్బే. నే నెందుకంటానూ? మాంచి పులిలాంటి వాడన మంటావు గనూ! (పోబోతాడు).

పిచ్చి:-అవునవును. అయితే ఒక్క మాటరా, విశ్వం. నేను చెప్పలేనంత మండిపడుతున్నాననికూడా చెప్పూ! విపరీతమైన ఆగ్రహంగా ఉందను.

విశ్వం:-చెబుతాను, చెబుతాను.

పిచ్చిబాబు:-మరిచిపొయ్యేవుసుమా, విశ్వం— మొసలి పట్టు!

విశ్వం:-ఆ, ఆ- రౌడీ బాబు. (చెంగో వేస్తూ వెళతారు.)

## రెండో రంగం : తికమకమ్మ ఇల్లు.

(తికమకమ్మా, నళినీ)

తికమకమ్మ:-ఇంత పెడకట్టైవేమే. అతనెందుకక్కర్లేదూ? అందంగా లేడనా? పెద్దమనిషి కాడనా? ఏమిటీ నీ అభ్యంతరం?

నళిని.-(స్వగతం)అతనెవరో తెలీక ఏం మెచ్చుకుంటున్నది! (పైకి) శృంగారరంగారు కూడా అంతటివాడే.

తికమకమ్మ:-నీ ఉపమానాలు నా దగ్గిర చెప్పకు. ఉపమానాలు రః. డొచ్చిన ఆడపిల్లలకు పనికిరావు. కాప్టెన్ విశ్వం చాలా యోగ్యుడు!

నళిని:-(స్వగతం) నువుచూసిన కాప్టెన్ విశ్వం చాలా యోగ్యుడే.

తికమకమ్మ:-ఎంత వినయం! ఎంత ఉల్లాసం! ఎంత విశ్వాసం! ఎంత అమితభాషి! ఎంత చక్కని భాష! ఎంత చదరమైన ముఖచర్య! ఎంత నిండైన మనిషి! అతన్ని చూస్తూనే నా కన్యాపదేశంగా పద్యం పూరించింది. "నల్లనివాడు, పద్మనయంబులవాడు, నమరస్మేరాభి రామా కృతిన్—" అతన్ని చూడగానే నా కానిదర్శనం వెంటనే పట్టింది.

నళిని:-(స్వగతం) నిజం తెలిసినప్పుడుంటుంది గమ్మత్తు.

(నౌకరు వస్తాడు)

నౌకరు:-నిరంకుశం పంతులుగారూ, వారబ్బాయిగారూ వచ్చారమ్మా.

తికమకమ్మ:-ఇట్లా రమ్మను. (నౌకరు పోతాడు) ఇదుగో, నళినీ, నీపిచ్చివేషాలు కట్టిపెట్టి కాస్సేపు మర్యాదగా ప్రవర్తించు.

నళిని:-నా అభిప్రాయం నేను మొదటే చెప్పాను. ఇతన్ని నేను ప్రోత్సహించను. సరేకదా, ఇతని కేసి చూడనుగూడా చూడను.

(వాకిలి వీపుపెట్టి మరో కుర్చీలో కూచుంటుంది.)

(నిరంకుశం పంతులూ, విశ్వమూ వస్తారు.)

నిరంకుశం:- ఏమండీ, తికమకమ్మగారూ, చిన్నదాని అలక తీర్చటానికివచ్చాం. వీణ్ణి వెంటపెట్టుకురావటానికి తాతలు దిగొచ్చారు. విషయమేమిటో నాకు తెలీటంలేదుగాని నేను జాగర్తగా ఉండకపోతే జారుకునేవాడే.

తికమకమ్మ:-మీరు పాపం చాలా శ్రమపడ్డారు. విషయమేమిటో నాకు తెలుసు లెండి. తలుచుకుంటే నాకే అవమానంగా ఉంది. (రహస్యంగా నళినితో) లేచి సరిగా కూచోవే, కొరివీ!

నిరంకుశం:-మా కుర్రవాడి విలక్షణతా, మీ అనుకూలతా, నాతో బాంధవ్యమూ మీ మేనగోడలు చక్కగా గ్రహించిందనుకుంటాను (రహస్యంగా) అబ్బాయి, పిల్లని పలకరించూ!

విశ్వం:-(స్వగతం) చచ్చాను! (పైకి) చూడండి, నాకేసి చూడనన్నా చూట్టం లేదు. మీరుండబట్టే! నా కీమాట ముందే తెలుసు—నే చెప్పాను కూడాను! నామాట విని మీరు వెళ్ళిపొండి. (బతిమాలతాడు)

నళిని:-(స్వగతం) మాఅత్తయ్య ఇంకా ఆశ్చర్యపడదేం? అతని కేసి సరిగా చూడలేదుగామాలు. డ్రెస్సంతా ఒకటిగా ఉంటే కనుక్కో లేకపోయిందేమో!

నిరంకుశం:-నేను కదలనే కదల్నూ!

తికమకమ్మ:- నా తిరస్కారం అది పాటించవంటే (రహస్యంగా) వెనక్కి తిరగవే, నాకవమానం తెలుస్తున్నావూ!

నిరంకుశం:-నా కొడుకంటే తన కెందుకిష్టంలేదో నా పెద్దరికం పాటించి నళిని చెప్పెయ్యగూడదూ? (రహస్యంగా) నోరుమెదలదేం రా? మాట్లాడూ! పలకరించూ!

తికమకమ్మ:- దాని కేమభ్యంతరముంటే? అభ్యంతరాని కేమి తేందే? (రహస్యంగా) బయట చెప్పవేమే, మొండే?

నిరంకుశం:,అయితే కేవలమూ కుర్రతనంచేత సంబంధం పాడుచేసు కోవటం దేనికి? (రహస్యంగా) మాట్లాడవుట్రా, వెధవా?

నళిని:-(స్వగతం) నే నెంత మౌనంగా ఉన్నానో పెళ్ళికొడుకంత కంటె బెల్లంకొట్టిన రాయల్లే ఉన్నాడే! మా అత్తయ్య కేమైనా కళ్ళు పోయాయా ఏం?

విశ్వం:- (గొంతు సవరించుకుంటూ)హుం!—ఇదుగో—హుం! (తండ్రివంక తిరిగి) నాకు—నాకేమిటో భయంగా ఉందంటే. కంగారుగా ఉంది. నేను మొదటే చెప్పాను. నాకు తెలుసు. ఆనందంతో నాకు మతిపోతోంది.

నిరంకుశం:-నీ నాలిక పడిపోలేదుగా. ఫో! దగ్గిరి కెళ్ళి మాట్లాడు.

(తికమకమ్మకు సంజ్ఞ చేస్తాడు.)

తికమకమ్మ:-వాళ్ళిద్దరూ మాట్లాడతారేమో. మనం అవతలికి పోదామా. (రహస్యంగా) కొరివి కానా!

నిరంకుశం:-కాస్త ఆగండి (రహస్యంగా) నోరు పెగల్దేం?

(విశ్వం నళినిని సమీపిస్తాడు.)

విశ్వం:-(స్వగతం) వెనక్కి తిరిగి చూడకుండా ఉంటే, దేవుడి దయ వల్ల! గొంతు మార్చేస్తాను.

నిరంకుశం:-వీడికేం రోగం? నోరెత్తవేం?—గొంతురాచుకు పోయిన కప్పల్లే!

విశ్వం:-నాకు—నాకు—దడగా ఉంది! ఏదో భయంగా ఉంది.

నిరంకుశం:-భయమా? ఒరే, ఇదే చెబుతున్నాను, నువు తక్షణమే నోరు తెరిచి మాట్లాడకపోతివా, నే నూరుకునేవాణ్ణి గాను! తికమకమ్మ గారూ, ఆపిల్ల నొక్కారవ్వ ఇటుకేసి తిరగమంటారూ?

(తికమకమ్మ నళినిని మందలిస్తుంది)

విశ్వం:-ఇంకేముందీ? కొంప కూలిపోయింది! (నళిని దగ్గిరికి వెళ్ళి రహస్యంగా) ఆశ్చర్యపడ మాకు, నళినీ. ఎంతాశ్చర్యం కలిగినా అణుచుకో.

నళిని:-(స్వగతం) ఓయమ్మో, శృంగారం గొంతే! నిరంకుశం పంతులుగార్ని కూడా టోపీవేశాడా? (మెల్లిగా తలతిప్పి చటుక్కున లేస్తుంది) నిజంగా, నువేనా, శృంగారం? ఇంకెవరో అనుకున్నాను.

విశ్వం:-(స్వగతం) చంపేసింది!

నిరంకుశం:-శృంగారమా? శృంగారమేమిటి? ఏమిటా అమ్మాయనేది? వీడు నా కొడుకు, విశ్వం.

తికమ:-నోరుమూసుకోవే, తప్పుడుదానా! నీ మనస్సులో వాడుతప్ప మరోటిలేక కళ్ళుకూడా భ్రమిసినై. కాప్టెను విశ్వంగారి క్షమాపణవేడు.

నళిని:-నా శృంగారం తప్ప, నాకు కాప్టెను విశ్వం కనిపించటంలేదే?

నిరంకుశం:-ఛా! ఈపిల్లకి పిచ్చిపట్టింది! పుస్తకాలు చదివి చదివి ఉన్నమతి కాస్తాపోయింది.

తికమకమ్మ:_నిజమైన మాటన్నారు! శృంగారమంటా వేమిటే, తప్పుడు దానా? కాప్టెను విశ్వంగార్నింతకుముందు చూళ్ళేదూ? అతనే ఇతనూ! నీ కాబొయ్యే భర్త!

నళిని:-నే కాదన్నానా? నా శృంగారాన్ని కాదని—

నిరంకుశం:-నిస్సందేహంగా ఇది ఉన్మాదమే!—లేక ఈ వెధవ ఏదైనా దొంగెత్తులు వేస్తున్నాడా? ఎవర్రా, నువ్వు?

విశ్వం:-ఏమో, నాకే సరిగా తెలీటంలేదండీ. జ్ఞాపకం చేసుకోనివ్వండి.

నిరంకుశం:-వెధవా, నువు నా కొడుకువా, కావా? నా కోసం కాక పోయినా మీ అమ్మ ప్రతిష్ట నిలపటానికైనా చెప్పు!

తికమకమ్మ:-అవును, నువ్వెవరోయ్! ఆలోచిస్తుంటే నాకూ అను మానంగానే ఉంది.

విశ్వం:-(స్వగతం) ఏం పీడవచ్చిపడిందిరా, బాబూ! (పైకి) నిరం కుశం పంతులుగారూ, నేను తప్పకుండా మీ అబ్బాయినే. నేను మరో విధంగా ఎప్పుడూ ప్రవర్తించలేదు కూడానూ—తికమకమ్మగారూ, తమ విధేయుణ్ణి. మీ కాబొయ్యే మేనగోడలు మొగిణ్ణికూడానూ—నేను శ్యాంగా రాన్నికూడా నని నా నళినికి వేరే చెప్పుకోనవసరం లేదు. ఆమెకు అనాథ లంటే ఉండే అభిమానాని కనుకూలంగా నేను నాస్థితి తగ్గించుకొని మారుపేరుతో ఆమె ప్రేమ స్వార్ధరహితమని రుజువుచేసుకున్నాను. అనాథను కానని తెలిసి తన ప్రేమను దాచుకో దనుకుంటాను.

నళిని:-బాగుంది! (నిస్పృహగా) అయితే లేచిపోవటమూ, ఏమీ లేదన్నమాట.

నిరంకుశం:-ఓరి దొంగభడవా! ఎంత నాటకం ఆడావూ?

విశ్వం:-మీరనవసరంగా నన్ను మెచ్చుకుంటున్నారు. నే నెంతో భయపడ్డాను.

నిరంకుశం:-పోనీలే, నువ్వింకా వొట్టి చవటవనుకున్నాను. నన్నే మోసపుచ్చావంటే, మెచ్చుకోవలసిందే! ఇదా నీ పశ్చాత్తాపం! నీ ధర్మం! నీ తండ్రి ఆజ్ఞ శిరసావహించటం! ఎంతలో మారాడా అని నేనింకా ఆశ్చర్యపడ్డాను. వీళ్ళ పేర్లుకూడా ఎరగవుకాదూ? నన్ను సంతోష పెట్టటం తప్ప నీకింకేమీ అక్కర్లేదుకాదూ? దొంగవెధవా! చూడూ! (నళినిని చూపి) మెల్లకన్నుందికాదూ? ఎర్రజుట్టేనా? బొల్లికభుర్లూ

నువ్వేనా! షా మొహాలు చూడటానికి నీకు బిడియమైనా లేకపోవటం నాకు మరీ ఆశ్చర్యంగా ఉంది.

విశ్వం:-నాకు కష్టంగానే ఉందండి. ఎంతో ఖంగారవుతున్నాను.

తికమకమ్మ:-ఇదుగోనండోయ్, నిరంకుశం పంతులుగారూ, నా కంతా అర్థంమయిపోయింది. అదుగదీ! ఏం? నాకా ఉత్తరం రాసింది నువు కాదా, అబ్బాయ్? ముసలితొక్కా, లంఖిణిముండ అన్నది నువ్వేనా, నాయనా? నా నామవాచకాల నవమానించింది నువ్వేగా?

విశ్వం:-నాన్నగారూ, నన్ను మీరు రక్షించకపోతే ఈ భయం నన్ను పూర్తిగా కుంగదీసేస్తుంది.

నిరంకుశం:-పోనిస్తురూ, తికమకమ్మగారూ, ఇవన్నీ మనం పాటించ రాదు. ఆఖరుకు విషయాలెంత అనుకూలంగా మారినయ్యో చూస్తే నాకే కోపంపోయి నవ్వొస్తున్నది! ఏం, తికమకమ్మగారూ?

తికమకమ్మ:-మీరట్లా అంటున్నారు గనక మనం గడిచినదాన్ని ఆవాహన చెయ్యొద్దు. ఏం పిల్లలూ, మేమిక రాబోయేదాన్ని గురించే సింహావలోకన చేస్తాం!

(నిరంకుశంగారి వెంట వెళ్ళిపోతుంది)

విశ్వం:-(స్వగతం) చాలా కోపంమీద ఉన్నట్టుంది (పైకి) ఏం, నళినీ, ఏమిటా దీర్ఘాలోచన?



నళిని:-ఏమండీ?

విశ్వం:- (స్వగతం) అబ్బో! పాకం చాలా ముదురుమీదుంది (పైకి) మన దాంపత్యానికి మనవాళ్ళంతా అంగీకరించారు గనక—

నళిని:-అంగీకరించరూ?



విశ్వం:-చూడు, నళినీ, ఎంతసేపూ మనం ప్రేమనుగురించే ఆలోచిస్తే ఎట్లా? కాస్తడబ్బూ, సుఖాలూ కూడా భరించాలి! ఏంచేస్తాం? పోతే నీ ఆస్తివిషయం ఉందే ప్లీడర్లనడిగి—

నళిని:-నాకు ప్లీడర్లంటే తగనిపంట!

విశ్వం:-అయితే పోనీ, వాళ్ళ దస్తావేజులకు వాయిదావేతాం. వెంటనే పురోహితుణ్ణి ఏర్పాటుచేసి....

నళిని:-నాకు పురోహితులంటే తగని మంట!

విశ్వం:-(బతిమాలుతూ) అంత కోపగిస్తే ఎట్లా, చెప్పూ!—

నళిని:- నన్ను తీరా సంపాయించుకున్నాక ఈ బతిమాలటాలుకూడా దేనికి?

విశ్వం:- అట్లా ఒక్కనాటి కనుకోకు. నిన్ను నేను బలాత్కరించే వాణ్ణికాను. నీకు నిజంగా నామీద మనస్సువిరిగితే, మిగతా విషయాలతో నాకేంపని. (స్వగతం) కాస్త రోషం తెప్పించిచూద్దాం.

నళిని:- నిజం చెబుతున్నా,వినండి. మీరు నా మనస్సును దొంగచాటున మోసంచేసి సంపాదించారు, వంచనకింద మిమ్మల్ని న్యాయంగా శిక్షించాలి. నన్ను పసిపిల్లను చేస్తారా? నా ప్రేమతో ఆడుకుంటారా? మహా తెలివి గల పని చేశానని మురుస్తారా?

విశ్వం:- అన్యాయం మాట లనకు, నళినీ! విను—

నళిని:- నా చుట్టాలందర్నీ మోసంచేస్తున్నాగదా, అందరినీ ఏడిపిం చేస్తున్నాను గదా అని నేను సంతోషిస్తుంటే మా అత్తను ఒప్పించి నా సంతోషమంతా భగ్నంచేస్తారా? చివరకు మోసపోయిం దెవరంటే నేనేగా? (రవికెలోనుంచి బొమ్మ పైకితీస్తూ) ఇదుగో, చూడండి, శృంగారం ఫోటో! బతిమాలినా, తిట్టినా వినక అహర్నిశలు దీన్ని దగ్గిర పెట్టుకున్నాను. ఇదుగో (ఫొటోపారేసి) ఈ మనిషినికూడా నా హృదయం లోంచి అవతలపారేశాను.

విశ్వం:- చూడు, నేనుమటుకు—? (మరో ఫొటో పైకితీసి) నళిని ఫొటో! ఇదుగో, నామీద ప్రేమతో విసిరిన చిరునవ్వు. ఇవిగో, నామీది ప్రేమకు ముద్రవేసిన పెదవులు!— ఇదంతా పాతకథ అయిపోయింది! మళ్ళీ తిరిగిరాదు. ఇందులో నీకున్న చక్కదనం లేదేమో కాని ఇది మార్పుచెందని ఆకారం. అనా దెట్లావుందో ఈనాడూ అదేవిధంగా ఉంది. దీన్ని నేను పోగొట్టుకోలేను. (తిరిగి జేబులో పెడతాడు)

నళిని:- (కొంచెం మెత్తబడి) మీరు చేజేతులా చేసుకున్నారు. ఇప్పుడు తృప్తిఅయిందా?

విశ్వం:- కాకేం? అసలు, ప్రేమించటంకంటే ఇదే బాగుంది! హహ్హహ్హ! ఇదే పౌరుషమయినపని. చేసిన వందలాది వాగ్దానాలు తప్పితే మటుకేం? ఎబ్బే, అదో పెద్దవిషయంకాదు. "ఈ అమ్మాయికి బుద్ధి నిలకడ లేదాయేం?" అని అందరూ అంటే అంటారుగాక—ఎవరు పాటిస్తారు? లేదూ, మరీ దుర్మార్గాని కొడిగట్టి, "ఆ అబ్బాయికేమమ్మా నీమీద మొహం మొత్తి వొదిలేసి చక్కా బోయినాడు," అంటారు. అయినా మనం భయపడతామాయేం?

నళిని:-(స్వగతం) ఫెడేలున ఎంతెంత మాటలంటున్నాడూ! (ఏడుస్తుంది)

(తికమకమ్మా నిరంకుశంపంతులు తిరిగివస్తారు)

తికమకమ్మ:-ఇక మీ గుసగుసలు కాస్సేపుకట్టిపెట్టండి (అంటూవస్తుంది)

నళిని:- (ఏడుస్తూ) క్రూరుడా, ఇంతకంటె నీ దొంగవేషాలే నయం—

నిరంకుశం:- ఇదేమిటీమేళం? ఇవేం గుసగుసలండీ, తికమకమ్మగారూ. ఏమిటిది? నా కర్థంకాకుండాఉంది.

విశ్వం:- ఆవిణ్ణే అడగండి!

తికమకమ్మ:- నేను పూర్తిగా నిర్వీర్యురాలి నయిపోతున్నాను, ఏమిటే, నళినీ!

నళిని:- ఆయన్నే అడుగు!

నిరంకుశం:- నాకు తిక్కెత్తుతోంది. ఒరే, నువ్వింకా ఎవరో అన్నట్టు నటిస్తున్నావా?

విశ్వం:- నన్ను కదిలించకండి. నాకంటే ఆవిడే బాగా చెబుతుంది.

నళిని:- అత్తయ్యా, నువు నాతో శృంగారాన్ని వొదిలెయ్యమని సలహా ఇచ్చావు. అదుగో నీ శృంగారం. నీ కోరికప్రకారం ఆయన్ని వొదిలేస్తున్నాను. (వెళ్ళిపోతుంది)

తికమకమ్మ:- అయ్యో రాతా! అయ్యో ప్రారబ్ధమా!....నువ్వేమిన్ని

అవమానించలేదుగద, నాయనా?

నిరంకుశం:- అహ్హాహ్హాహ్హాహ్హాహ్హా! తెలిసిందిలే. దొంగవెధవా, ఏదో కోతిపనిచేశావు!

విశ్వం:- లేదండీ, నిజంగా——

నిరంకుశం:- అబద్దా లాడకురా! నాకు తెలీదూ?

తికమకమ్మ:- ఏమిటర్రా, మీమాటలూ మీరూనూ!

విశ్వం:- నిజంగానండీ——

నిరంకుశం - తప్పేమిట్రా? నేను మటుకు ఒకప్పుడు నీవంటివాణ్ణి కానూ? అసలు మనవంశంలోనే వేడినెత్తురుంది. హహ్హాహ్హా! పాపం పిచ్చిపిల్ల! దాన్ని కాస్తా బెదరగొట్టావు!

విశ్వం:- నేనసలేమీ——

నిరంకుశం:- పోనిస్తూ! తికమకమ్మగారు నళినిని ఓదారుస్తుందిలే. పిల్లను కాస్త ఓదార్చండీ, తికమకమ్మగారూ. విశ్వం తరహాయే అంత నండి. మా అందరి తరహాకూడా అంతేఅని చెప్పండి. అది మా రక్తం లోనేఉంది. రారా, విశ్వం! చూశారా. తికమకమ్మగారూ. వొట్టి దొంగ వెధవ! అహ్హాహ్హాహ్హా!

(కొడుకును తోసుకుంటూ పోతాడు)

తికమకమ్మ:- చాల్లెస్తురూ, మీ మాటలూ మీరూనూ!

(అందరూ వెళతారు)

## మూడోరంగం : ఉత్తర మైదానం

(కయ్యం పంతులు వస్తాడు)

కయ్యం:- ఈ కాప్టెను విశ్వం ఎక్కడ నక్కేదీతెలీదు. ఈసైసికోద్యోగులు రాహువుల్లే అడ్డు పడుతూంటారు. వెనక ఇట్లాగే నీలవేణిని చేసుకుందాంకదా అనుకుంటూంటే ఎవడో షేజరొచ్చి కొట్టుకు పోయినాడు. వీళ్ళనిచూసి ఆడవాళ్లెందుకు మోసపోతారో అర్థంకాదు—ఆ వచ్చేది కాప్టెను విశ్వంకాదూ? వెధవలో ఏదో ఆకర్షణఉంది— ఒళ్ళు మండి పోతూనూ! ఎవడితో మాట్లాడుతున్నా డట్లా? (పక్కకిపోతాడు)

(కాప్టెను విశ్వం వస్తాడు)

విశ్వం:-నేను వేసిన పన్నాగమంతా పాడై పోయింది! పడ్డశ్రమ కిదా ఫలితం? మొండిముండ! ప్రేమ అయితేమటుకు ఇంత చాదస్తమా? నాకేమిటో చిరాకుగా ఉంది. ఎందులోనన్నా దూకాలనుంది. లేదా ఎవణ్ణన్నా హత్యచెయ్యాలనుంది!

కయ్యం:- నా అదృష్టం కుళ్ళినట్టే కనిపిస్తుంది. మనిషి నాకు కావలిసిన ధోరణిలో ఉన్నాడు. మంచి సమయంలోనే దొరికాడు. ఇప్పుడు వీణ్ణి పలకరించి నాజూగ్గా పోట్లాటపెట్టుకోవాలి (విశ్వం దగ్గిరికొచ్చి) ఈ విషయంలో మాత్రం నేను మీతోనే ఏకీభవించను. దీనికేమంటారు, కాప్టెనుగారూ?

విశ్వం:-నేనేమీ అనకుండానే నాతో వ్యతిరేకిరించటం చూస్తే మీరు చాలా తెలివైన తార్కికుల్లా కనిపిస్తుంది.

కయ్యం:-దానికేం? పైకి ఏమీ అనకుండానే మనస్సులో అభిప్రాయ భేదాలుండరాదా?

విశ్వం:-అవునులెండి. అయినా అభిప్రాయం పైకి చెప్పినంత వరకూ ఇతరులు తప్పుపట్టే అవకాశం ఉండదేమో?

కయ్యం:-ఆమాటతో నే నేకీభవించను. క్రియకు ఎటొచ్చీ ఒకటే అయింది.

విశ్వం:-చూడండి, కయ్యం పంతులుగారూ—అదివరకే మిమ్మల్నెరుగుదును గనక సరిపోయింది గాని, ఇదే తమ ప్రథమ దర్శనమై ఉంటే తమరు పెద్దమనిషి అనే అనుమానం కలిగి ఉండదు. మీ తరహాచూస్తే నాతో పోట్లాటపెట్టుకోవాలని ఉన్నట్టు అనుమానంగా ఉంది.

కయ్యం:-నా ఉద్దేశం ఇట్టే పసికట్టినందుకు చాలా కృతజ్ఞుణ్ణి.

విశ్వం:-సరే, మీ ముచ్చట తప్పక తీరుస్తానుగాని, మీకుగల కారణాలు కాస్త సెలవిస్తారా?

కయ్యం:-హైరాన పడకండి. ముచ్చటైనతగాదాకి కారణాలేకరువుపెట్టి పాడుచేసుకోవటం భావ్యంకాదు. కాని తమకు మతిమరుపు లావుగా కనిపిస్తుంది. కొద్దిరోజుల క్రితమే మీరు నాకు తీరని అవమానంచేశారు. కనక ఆవిషయం కట్టిపెట్టి మన వ్యవహారం పరిష్కారం చేసుకోవటానికి మీకు వీలయిన స్థలమూ, కాలమూ, చెప్పుకోండి.

విశ్వం:-మీ కంత ఉబలాటంగా ఉంది గనక ఆలస్యం అనవసరం. ఇవాళ సాయంకాలమే ఏర్పాటుచేసుకుందాం. ఈ పక్కనే మామిడితోపులోకి రండి. మనకేఅంతరాయమూ ఉండదు.

కయ్యం:-ఇటువంటి విషయాల్లో అంతరాయాలు సహించటం చాలా కష్టం. అదేం ఖర్మమో, ఇద్దరు మనుషులు తగాదా పరిష్కారంచేసుకుంటున్నారని ఆచోకీ తట్టగానే జనం గుంపులుగూడి నానా హంగామా చేస్తారు. శాంతిలేకుండా పోతుంది. అయితే, నేకోరేదేమంటే, మీ కభ్యంతరంలేకపోతే ఈ ఏర్పాటు మనం తూర్పుతోటలో చేసుకుందామని నా అభిప్రాయం. ఆరుగంటలకు నాకక్కడ చిన్న వ్యవహారం ఉంది. రెండు వ్యవహారాలూ ఒకేసారి పరిష్కారం అయిపోతాయని.

విశ్వ:-నాకెక్కడైనా ఒకటే. ఆరుదాటగానే వస్తాను. అప్పుడు మన అభిప్రాయభేదాలను గురించి దీక్షగా చర్చించుకుందాం.

కయ్యం:-తుపాకుల కవసరమైనంత వెలుతురుండకపోవచ్చు గాని,

కత్తులకు చక్కగా సరిపొయ్యే వెలుతుర్నుంటుంది. ఈ విషయం ఒకటి తేల్చుకున్నాం గనక నాకు చాలా హాయిగా ఉందిప్పుడు. (వెళ్ళిపోతాడు)

— —— (అనుమానం విశ్వాని కెదురొస్తాడు)

విశ్వం:-సమయానికి కొచ్చావు. నీ కోసమే వస్తున్నాను. ఒరే అనుమానం! నాకు బొత్తిగా పొద్దెదురవుతున్నదిరా! నా కెంత విసుగెత్తి పోతోందనుకున్నావు! కాస్సేపట్లో బుర్ర పగలగొట్టించుకునే అదృష్టం ఉందిగాని లేకపోతే మరీ నీరసించిపోదును.

అనుమానం:-నువ్వు చెప్పేది నాకర్థంకావటంలేదు. నళిని పెడతిరిగిందా? తన యిష్టమూ, పెద్దవాళ్ళ కోరికా ఏకమయింది గదా, ఇంకేం తెగులూ?

విశ్వం:-పోనిస్తూ. మెల్లకళ్ళవాడి మేళంగా ఉంది. ఒక కన్ను తన కోరికమీద ఉన్నప్పుడు రెండో కన్ను పెద్దవాళ్ళ మాటలమీద ఉండదు. ఆ రెండో కన్ను పెద్దవాళ్ళకేసి తిప్పేసరికి మొదటికన్ను కాస్తా తన కోరిక మీదినుంచి పక్కకి తొలిగి ఊరుకుంటున్నది. ఇట్లా ఉన్నది నళిని వ్యవహారం.

అనుమానం:-ఏదో అదృష్టం పట్టిందన్నావే—

విశ్వం:-మరేంలేదూ. ఓ పెద్దమనిషి వచ్చి నాగొంతుకోయటాని కనుమతివేడాడు. పోనీ, యేడుచుకోనిమ్మని సరేనన్నాను, అంతే!

అనుమానం:- పిచ్చిమాటలాడక, నిజంచెప్పు.

విశ్వం:_నిజమేనోయ్! ఆ కయ్యం పంతులున్నాడే—వాణ్ణి నువుచూసే ఉంటావు!—వాడు నామీద లేనిపోని పగ ఏదో పెట్టుకుని సాయంకాలం ఆరింటికి తనతో వ్యవహారం తేల్చుకోమన్నాడు. అందుకే నీ కోసం బయల్దేరుతున్నాను. నువు నావెంట రావాలి.

అనుమానం:-ఆఁ, ఏదో పొరాపొచ్చై ఉంటుంది. కయ్యం పంతులు సద్దుకుంటాడులే! ఇవాళ సాయంకాలంకాదే —మరో అప్పుడైతే బాగుండి పోనే!

విశ్వం:-ఏం ?—కయ్యం పంతులుగాడన్నట్టు తుపాకులకు వెలుతురు

చాలకపోయినా కత్తులకు చక్కని మెరుపురుంటుందే! ఏడి వెలుతురు మండా!

అనుమానం:-రజనికీ నాకూ చెడటంవల్ల నామతి మతిలోలేదు. నేను నా దిక్కుమాలిన నసతో రజని నెంత తిక్కెక్కించానంటే తిరిగి ఇద్దరమూ సమాధాన పడేవరకూ నాకేమీ తోచదు.

విశ్వం:-రజనికి, పాపం, నువ్వొక్కడవే గాభరించావురా?

(నౌకరువచ్చి అనుమానానికి ఉత్తరం ఇస్తాడు)

అనుమానం:-ఒరే, విశ్వం. ఈ ఉత్తరం రజని రాసిందిరా—నాకు తెరిచి చూడటానికి చేతులాడటంలేదు. ఇందులో ఏమంటుందో—నాకపరక్రియలన్నీ చేసేసిందో ఏమిటో—తన ఉత్తరా లన్నీ తనకి పారెయ్య మంటుందిగామాలు!' ఛీ ఛీ, నన్నేంచేసినా పాపంలేదు.

విశ్వం:-ఏదీ—ఇటుతే (తీసి చించి చదివి) ఆహా! ఇంతటితో నువ్వు విరగడే! నీ పని అయిపోయినట్టే!

అనుమానం:- చంపక, విషయం కాస్తా చెప్పెయ్యి.

విశ్వం:-అయితే విను. "మీ రీ సరికి ఆత్మ పరీక్షచేసుకుని నన్ను బాధించినందుకు పశ్చాత్తాపపడి ఉంటారనే నమ్మకంతో, ఆ విషయం ప్రస్తావించటం లేదు. సాధ్యమై నంత త్వరలో మీతో మాట్లాడాలి. విధేయురాలు. రజని." చూడు ఎంత పెంకెగా పెడకట్టెగా ఉందో. (ఉత్తరం తిరిగి ఇచ్చి) ఏం? నీ మొహాన సంతోషం కనిపించదేం?

అనుమానం:-అవునులే, కాని, కాని—

విశ్వం:-ఓరి నీకానీలు కాలిపోనూ. ఏమాట చెపితే నీకానంద మనేది కలుగుతుందిరా?

అనుమానం:-అదిగాదురా, నువు నిజంగా చెప్పూ. ఆడవాళ్ళు తమంతట తమే మొగవాళ్ళను క్షమించటం ఏమంత నాజూగ్గా ఉందీ? ఆడవాళ్ళిట్లా ఎన్నడూ రాజీకిరాకూడదు! అది మనం మగవాళ్ళం చెయ్యాలి. మనచేత బాగా బతిమాలించుకుని ఆడవాళ్లు మనని కనికరించాలి. ప్రేమ

గాని, క్షమాపణగాని అడక్కుండా ఇవ్వరాదు. ఏమంటావు ?

విశ్వం:-ఏమంటానా? నీ మొహమంటాను. నిన్ను వెయ్యి పుటాలేసినా మారవు. అందుచేత ఈ విషయం నాతో మాట్లాడ కసలు. నాకు చాలా అర్జంటు వ్యవహారాలున్నాయి. సాయంకాలం ఆరింటికిముందుగా ఓ సారి మా యింటి దగ్గిర నన్ను కలుసుకో. ఎంతో శ్రమపడి, ఎత్తులువేసి, వ్యూహాలు పన్ని ఇతర్ల బుద్ధితక్కువ కొద్దీ గోతిలోపడి శ్రమంతా వ్యర్థం చేసుకున్న నా వంటి బుద్ధిమంతుడు నసపెట్టినా అందం, చందం! ప్రేమించటం చాతకాక, పెడకట్టె మాదిరిగా ప్రవర్తించి, చేజేతులా వ్యవహారం చెడగొట్టుకునే నీలాటి దేబెనుచూసి ఎవరు జాలిపడతార్రా ? (వెళతాడు)

అనుమానం:-ఉట్టిపోయినాడు! అయినా నా పద్ధతే సరిఅయినది. ప్రేమ పట్ల మనస్సు ఎంత సున్నితంగా పోవాలో వీడికేం తెలుసును—ప్రేమ దూలగొండిలో పడి పొర్లేవాడికి? ఈ కొట్లాటలో నన్ను సహాయం రమ్మంటున్నాడే, ఈ అవకాశంచూసుకొని రజని అంతరాత్మను తీవ్రంగా పరీక్షించి, ఆఖరు నిర్ణయానికి రావాలి. పరీక్షకు నిలబడిందా, రజని శాశ్వతంగా నాదే! ఓ వేళ పరీక్షకు తట్టుకోలేదూ, పోనీ పీడవిరగడయిపోతుంది. ఈ యూతన మరో అప్రయోజకు డెవడన్నా పడనీ, నాకెందుకొచ్చిన క్షోభ ?

(పోతాడు)

# అయిదో అంకం

## ఒకటో రంగం : రజని గది.

(ఏకాంతంగా రజని)

రజని:-ఈ కబురువిని నాకు భయంగా ఉందే! భయంకరమైన ప్రమాదం ఏమిటై ఉంటుంది? తను ఒంటరిగాడై పోవలసిన అవసరమేమిటి? నా బతుకింత పాపిష్టి బతుకయిపోయిందేం?

(అనుమానం వస్తాడు)

రజని:-ఏమిటండీ ఇదంతా?—ఇంత గుట్టెందుకూ?

అనుమానం:- నీ దగ్గిర శెలవుపుచ్చుకుందామని వచ్చాను, రజనీ.

రజని:-అంటే?

అనుమానం:-నా జీవితం తోలీ విలవచెయ్యాని పరిస్థితి ఏర్పడింది. ఏం చెప్పను? నా తెలివితక్కువకొద్దీ నేను చేసుకున్నదేలే! నీతో కీచులాడిన తరవాత నేనో భయంకరమైన ప్రమాదంచేశాను. నేను దేశం విడిచి పారిపోక తప్పదు. రజనీ, మన కింతకుపూర్వమే పెళ్ళయి ఉంటే ఎంత బాగుండేది! ఏదేశాంతరం పట్టిపోయినా పక్కన నువ్వుంటే నే నింతగా బాధపడను కద!

రజని:-మీ కష్టాలుచూ స్తే నా గుండె పగిలిపోతున్నది. నా ప్రేమను గురించి మీకున్న అనుమానాలన్నీ పోయినందుకు సంతోషించటానికికూడా నాకు గుండె లేకుండా ఉంది. మీరు తప్ప నాకెవరూలేరు. నేనూ మీ వెంటనే వస్తాను పదండి. ఈ ఇక్కట్టు గడిచిపోయినాక మీకు నేనివ్వగల సుఖమంతా ఇచ్చి మీ కష్టాలకూ, బాధలకూ భాగస్వామిని ఔతాను.

అనుమానం:-రజనీ, నీకు కృతజ్ఞత చూపటంకూడా నాకు చాతకావటం లేదు. ఇంత ముఖ్యమైన నిర్ణయంచేసుకునేటందుకు వ్యవధిలేదే

ఎట్లా ? నేను నీకు ప్రేమతప్ప ఏమీ ఇవ్వలేను కదా, దానికోసం నీ సుఖ మంతా త్యాగంచెయ్యటంగురించి ముందు వెనక లాలోచించుకోవటానికి వ్యవధి అవసరం లేదూ ?

రజని:-అక్కర్లేదు. నేను మిమ్మల్ని తప్ప మరేమీకోరలేదు. మిగతా విషయాలను గురించి ఆలోచించవలసిన అవసరం తప్పటం మూలాన నా పని మరింత తేలికయింది. ఇక మనం వృథాకాలయాపన చెయ్యొద్దు. ఇప్పటికే——

అనుమానం:-నేను పొద్దూకినదాకా బయటికి కదలటానికి లేదు. నాతో, పాపం, నువ్వెన్ని కష్టాలు పడాలో!

రజని:-ఈ ఆపదవల్ల మీ ఆస్తికే ఒకవేళ ముప్పం వస్తుందేమో. ఆ సంగతి నేనెరగను. కాని మనం అంతమాత్రానికే విచారించ నక్కర్లేదు. నాకున్న తృణమో కణమో పెట్టుకుని మనం ఏదో విధంగా గడుపుకో వచ్చు. దేశాంతరాలలో మనకు వైభవం దేనికీ ?

అనుమానం:-అవునుగాని, రజనీ, ఈ కష్టాలమూలంగా నా మన స్తత్వం మరింత హీనమైపోయి నా మూలంగా నీకు మరింత బాధకలుగు తుందేమో ? చెయ్యరాని పని చేశాననే బాధవల్ల నేను నీ ఉపచారాలకు తృప్తిపడటానికి బదులు రోతపడి నీ ప్రేమను మరింత అవమానిస్తా నేమో ?

రజని:-మీకు నిజంగా అటువంటి దుస్థితేవస్తే మిమ్మల్ని ఓర్పుతోనూ, ప్రేమతోనూ చూసేమనిషి——మీ దౌర్బల్యాన్ని సహించటం చాతనయి, ఆ విధంగా మీలో కొంత ఆత్మవిశ్వాసం కలిగించగల మనిషి——వెంట ఉండటం మీకు మరింత అవసరంగదా ?

అనుమానం:-రజనీ, నీ హృదయం పరీక్షించి నా అనుమానాలు నివృత్తిచేసుకునేటందుకుగాను నిన్నెంత మోసగించానూ! నా చపల చిత్తం ఎత్తిన ఈ ఎత్తు నువెట్లా క్షమిస్తావో ?

రజని:-ఏమిటి, మీకు నిజంగా ఏ ఆపదా రాలేదా ?

అనుమానం:-లేదు, రజనీ. ఆగ్రహించకు: ఇటువంటి పని మరెప్పుడూ చెయ్యనని మాటిస్తాను. ఇవాళ ఈ పాడుపనిచేసినందుకు రేపు నిన్ను పెళ్ళాడి యావజ్జీవమూ పువ్వుల్లో పెట్టి పూజిస్తాను.

రజని:-ఆగండి. మీరెంత ఘోరంచేశారో అని లోపల కుళ్ళిపోతున్న నా ఆరాటం పోగొట్టినందుకు నా కెంతో ఆనందంగా ఉంది. ఇవి అశ్రువులుకావు. ఆనంద బాష్పాలు. కాని మీ అనుమానం పరిహారం చేసుకునేటందుకు నా మనస్సు నింత క్రూరంగా హింసించారే ఇప్పుడది ఎన్నెంత బాధిస్తున్నదో చెప్పలేను!

అనుమానం:-రజనీ!—

రజని:-వినండి, మా నాన్నగారికి మీరంటే ఎంతో ఇష్టంగా ఉండేది. ఆయన నాకు ప్రసాదించిన నా ప్రాణాన్ని మీరు కాపాడారు. ఆయన ఎదట మిమ్మల్ని పెళ్ళాడతానని మనస్ఫూర్తిగా ప్రమాణంచేశాను. మా నాన్నగారు పోయాక నా ప్రేమ విశ్వాసా లర్పించటానికి మీరు పక్కనే ఉన్నారు. అందుకనే ఇంకొకరంటే సహించనిమాటలు మీరంటే సహించాను. మీరు నా హృదయాన్నెంత అనుమానించిందీ మీకే తెలుసు.

అనుమానం:-నువ్వన్నదాన్లో అబద్ధం ఏమీలేదు. కాని—

రజని:-ఈ విధంగా సంవత్సరంనుంచీ బాధపడుతున్న నామీద ఈ భయంకరమైన కొత్త అస్త్రం ప్రయోగించవలసిన అవసరం ఏమిటో నాకు తెలీదు. మీరు ప్రేమను విశ్వసించలేరనీ. ఎంతకీ సంతృప్తిపడరనీ నా కర్థమైపోయింది. నేను ఓర్పుతోనూ, ప్రేమతోనూ, చూపిన సహనానికి ప్రతిఫలం ఏమైనాకలిగి, మీ ప్రేమను నేను సంపాదించుకో గలిగితే బాగుండేది. కాని నా సహనాన్ని, మీరు నన్ను మరింత బాధించటానికే ఉపయోగించుకున్నారు. ఈ మనిషి నామీద నా ఆయుధాలే ప్రయోగించటం లేదే; అటువంటిదానిమీద ఈ ఆయుధాలు ప్రయోగించటం ధర్మమా అని మీ రాలోచించలేదు.

అనుమానం:- అదికాదు, రజనీ, ఇకముందెప్పుడైనా—

రజని:-ఇంకొక్కమక్కే ! నేను నా మనస్సు మీకు దత్తంచేశాను గనక దాన్ని మరోరి కివ్వటానికి ప్రయత్నించను. మీ సుఖంకోసం ఎప్పుడూ భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. భగవంతుడు మీలోఉన్న ఈ దిక్కుమాలిన దౌర్బల్యం ఏదోవిధంగా పోగొడతా డనుకుంటాను. మీరుకూడా మీలోఉన్న ఈ వ్యాధినిగురించి అప్పుడప్పుడూ ఆలోచించుకోండి ; దీని మూలంగా మీ రెంతసుఖం కోల్పోయినారో అంచనా వేసుకునేప్పుడు, మీతో ముష్టెత్తుకు బతకటానిక్కూడా తయారయిన ఈఅభాగ్యురాలు మీరు పోగొట్టుకున్న ఆనందాల్లో ఒకటిగదా అని తెలుసుకోండి. (పోతుంది)

అనుమానం:-వెళ్ళిపోయింది. ఇకఎప్పటికిరాదు. ఆ ప్రవాహంముందు నేను రాతిబొమ్మలా అయిపోయినాను. వెధవని—త్రాష్టుణ్ని—తెంపిని ! నా అంత చచ్చువెధవకి ఇటువంటి దేవతను దేవుడు ప్రసాదిస్తే నేను చేతులారా తోసేశాను. ఇక నేను కొట్టాటలో సహాయం చెయ్యటానికి పోవచ్చు. అంతకంటె ఇప్పుడు నాకు ఉచితమయిం దేముంది? సహాయం చెయ్యటం కాకుండా, కొట్టుకునేవాళ్ళల్లో ఒకణ్ణయి ఉండరాదూ ? ఏం ప్రేమ ? మహాపిశాచి ! వెధవల్ని మరింత చచ్చువెధవల్ని చేస్తుంది ! తెలివిగలవాళ్ళ బుర్రల్లోకెక్కి ఉన్మాదుల్ని చేస్తుంది. (పోతాడు)

(దాసీ వెనుక నళిని వస్తుంది)

దాసీ:- అమ్మగా రింతకుముం దిక్కడే ఉన్నారండి. పక్కగదిలో కెళ్ళారేమో చూస్తా ! (వెళ్ళిపోతుంది)

నళిని:-ఈ దుర్మార్గుడు నన్నింత మోసగించినా నాబుద్ధి అతనిమీదికే పోతుందేం ? మా రజని రెండు నిమిషాలు లెక్చరుదంచిందంటే నేను మతిపోయి అతనికోసం కబురుచేసేస్తాను కూడానూ.

(రజని వస్తుంది)

ఏమే, రజనీ, నాబాధలు చెప్పుకుందామని వచ్చానే ! అయ్యో, ఆదేమిటే, నువ్వే ఏడుస్తున్నావా ? ఆ అనుమానం వొచ్చి నిన్నేడిపించి వెళ్ళాడా ఏం ?

రజని:-ఎబ్బే, అదేంలేదులే, నా కేదో మరో బాధ వచ్చిపడింది. నీకు తెలిసినవిషయంకాదు—— (స్వగతం) అనుమానంగారి సంగతి దీని కెందుకు చెప్పటం?

నళిని:-ఎవరి కే కష్టాలొచ్చినా, నా కష్టాలంటివి మటు కెవరికీ రావమ్మా! ఇంతకూ శృంగారరంగారంటే ఎవరో తెలుసా?

రజని:- తెలుసును, దాచటం దేనికీ? అనుమానంగారు నాతో ఆ కథంతా చెప్పారు. విశ్వం నిజంగా నువ్వనుకున్న అసాధ్యుడయితేంటే నీ చావ స్తం చూస్తూ, నీతో పోట్లాడకుండా ఊరుకునే వాన్ననుకున్నావా?

నళిని:-ఇంకేం? నన్నంతా కలిసే మోసంచేశారన్నమాట!—— ఏ మయితే నాకేం? నేనుమటు కతన్ని చచ్చినా పెళ్ళాడను.

రజని:-అదికాదు, నళినీ——

నళిని:-ఏమిటే, వాళ్ళుమండిపోతూనూ? కొంపలు చక్కగా అంటు న్నాయని నేను సంతోషిస్తున్న సమయంలో నన్ను శాస్త్రా గోతులోకి తోసేస్తారా? తాళ్ళసహాయంతో ముచ్చటగా కిటికీల్లోనుంచిజారి, ఎంతో ముచ్చటగా లేచిపోయి, రహస్యంగా పెళ్ళాదేస్తే, తికమకమ్మకు తిప్పలు రావటమేకాకుండా, పత్రికలన్నిటిలోనూ ఛడామడా రాసేస్తానుగదా అని ఎంత సంతోషించాను? నా ఆశలన్నీ నిరాశలై పోయినై.

రజని:-ఎంతకష్టమే. పాపం!

నళిని:-ఇప్పుడు మిగిలిందేమిటీ? ఏడుస్తూ పెళ్ళిప్రయత్నా లన్నీ చేసు కుని, అందర్నీ పిలిచి, పురోహితుణ్ణి పిలిచి, యథావిధంగా తలనొప్పెత్తే ట్టు మూడుముళ్లూ వేయించుకుంటుంటే, మా అత్తయ్య పక్కనుండి ముసిముసినవ్వులు నవ్వటమేగాదుటే! ఇంతకూ నామొహాన పెళ్ళిరాతలేదు!

రజని:-నిజమేనే, పాపం!

నళిని:-ఇతనితో ఒక్కక్షణంమాట్లాడటానికి ఎన్ని దొంగేత్తులువేశానే! అర్ధరాత్రి కటికచీకట్లో ఎవరూ చూడకుండా ఇతనికోసం బయటికొచ్చే దాన్ని! శీతకాలం ఇద్దరమూ అసు బయటనిలబడి బాడికిపోతూంటే

నన్ను మెచ్చగా దగ్గరికి తీసుకునేవాడు. ప్రేమంటే అట్లా ఉంటుంది!

రజని:-నిన్ను చూసి నవ్వటాని కిప్పుడు ఓపికలేదుగాని, నువు నటుకు ఇంతగా ప్రేమించేవాణ్ణి పిచ్చివేషాలువేసి పోగొట్టుకోకు.

నళిని:-మా అత్త ఇక్కడి కెందుకొచ్చిందో!

(తికమకమ్మా, చుట్టయ్యా, నూరన్నా వస్తారు)

తికమకమ్మ:-అయ్యో! అయ్యో! ఇంకేముంది? అంతా అయిపోయింది. ఆత్మహత్య! భ్రూణహత్య! ఉపద్రావకం జరిగిపోతోంది. ఈ విపద ఆపటానికి నిరంకుశం పంతులుగారైనా కనిపించరేం?

రజని:-మీరు చెప్పే దేదో సరిగా చెప్పుదురూ!

తికమకమ్మ:-అదుగో, అతన్నడుగు. అంతా నాకు సంగ్రహపరిచింది ఇతనే.

రజని:-(చుట్టయ్యతో) ఏంజరిగింది, బాబూ?

చుట్టయ్య:-అమ్మా, మీరంత ఆదుర్దాపడి అడుగుతున్నప్పుడు నేను ఉన్నంతలో నాకు తెలిసినమట్టుకైనా వెంటనే చెప్పెయ్యకపోతే అదేమంత భావ్యంగా ఉంటది మీరే చెప్పండి.

రజని:-అవును. ఏంజరిగింది? త్వరగా చెప్పు.

చుట్టయ్య:-తమరు శెలవిచ్చినట్టు తచ్చనం చెప్పెయ్య వలిసిన విషయమే గాని మరోటా, అమ్మా? అసలు మన మిక్కడ నిలబడి తీరిక మీద మాట్టాడతా కూకున్నామంటే మూడుపానాలూ పుణ్ణానికి పుటిక్కన తెగిపోవా?

రజని:-పోఁపుణ్యం ఉంటుంది. మీరన్నా చెబుదురూ సంగతేమిటో!

తికమకమ్మ:-ఇంకా చెప్పేదేమిటి, నాపిండం? హత్యలు జరిగిపోతుంటేనూ! గొంతులు కోసేసుకుంటున్నారు. ఆ విరహాలన్నీ అతనికే బాగా తెలుసు. అతన్నే చెప్పనీ.

రజని:-అట్లాఅయితే, చెప్పేదేదో త్వరగా నువ్వే చెప్పుదూ, బాబూ.

చట్టయ్య:-అమాటంటున్నారు గనక చెప్పేస్తాను. హాస్యాలంటారా, నన్నడగ మాతంచిసురి! గొంతులు కొయ్యగానే సరిపాయినట్టేనా? తరవాత కోరటుకీడ్చినప్పుడుండదూ సంబంధం!

రజని:-ఎవరు: ఎవ రీపని చేస్తున్నది?

చట్టయ్య:-ఆయన్ని ఎంతకాలమై, ఎంత విశ్వాసంతో కనిపెట్టు కున్నాను! ఎంత పెద్దమనిషి! ఆయనకేమైనా అయితే నాపాణంటరు స్తదా?

రజని:-ఎవరది? ఎవరు? ఎవరు?

చట్టయ్య:-ఇంకెవరండి. మాదొరే!

రజని:-కాప్టెను విశ్వంగారే?

తికమకమ్మ:-ఇప్పుడు నీకూడా భయమేస్తుందిగద?

రజని:-ఆయనవెంట ఇంకెవరున్నారు?

చట్టయ్య:-అ విషయాలు నాకన్న సూరన్నకు బాగా తెలుసునండి.

రజని:-నువు చెప్పు, నాయనా.

సూరన్న:-నే శెపుతున్నానుగాదా, మా గోరమయిన విషయం అ..పో తున్నది. వృత్తిపున్నానికీ పెద్దమడుసులు కత్తులూ, కటార్లూ, గునపాలూ, సమ్మెట్లూ, పట్టుకెల్లాలిసిన పనేందంట! మీరే యిచారింపిచ్చండి.

రజని:-విశ్వంగారి వెంట ఇంకెవరెవరున్నారు?

సూరన్న:-మా అయ్యగారి సంగతి ముందుసెపటం దరమం గదాండి. నాపేరు సూర్నన్నంటారండి. మాఅయ్యగారిపేరు పిచ్చి బాబుగా రంటా రండి—అంటే, అనేవారండి! అతరవాత అనుమానంగారు కూడా ఉన్నా రండి మరి.

రజని:-మనంవెళ్ళి వెంటనే ఈ అల్లరి ఆపుదాం వస్తారా, తికమ కమ్మగారూ!

తికమకమ్మ:-ఛీ, ఆదేం సబబుగా ఉంటుంది. అనవసరంగా మనం ప్రకోపించిన వాళ్ళమవుతాం.

సూరన్న:-రండమ్మగారూ, నాలుగు పానాలు నిలబెట్టి పున్నెంకట్టు

కుందుహూ! ఎందుకంటే పచ్చిమాంసం తినే ముండాకొడుకు కయ్యం పంతులుకూడా ఉండా దక్కడ.

తికమకమ్మ:-కయ్యంపంతులే! పిచ్చివాణ్ణిచేసి, పాపం. ఆయన్నుకూడా ఈ ముఠాలో చేర్చారూ? ఇంత మాటవిని ఇంకా చూస్తూ నిలబడతారే మర్రా? మీకు హృదయపరివర్తనం లేదూ?

నళిని:-ఏం చేద్దామని?

తికమకమ్మ-సాధ్యమైనంత చమత్కారంగా అక్కడికి పరిగెత్తి అడ్డపట్టమే. ఇదంతా ఎక్కడో నీకు తెలుసునా, అబ్బీ?

చుట్టయ్య:-ఓ, నాయెనకాతలే చల్లగా వొచ్చెయ్యండి. సూరన్నా! నువెళ్ళి నిరంకుశం పంతులుగార్ని యెతక్కురారా!

(సూరన్న పోతాడు)

తికమకమ్మ:-రండే అమ్మాయిలూ! నువు మమ్మల్ని హెచ్చరించు బాబు. ఇప్పుడు నువ్వే మా దూతవు. నీ వెనుక మేం పురోగమించ వలసినవాళ్ళం.

చుట్టయ్య:-రండమ్మా, మరి.

తికమకమ్మ:-నీకీ చోటు గుర్తుందిగదూ?

చుట్టయ్య:-లేకేమమ్మా? టకీమని యేలెట్టినట్టు తెలవకపోయినా తుపాకుల మోతయినిపిస్తుంది కనక తప్పకుండా చేరగలం, ఏం భయం లేదు, భయమేమీ లేదండి!

(అంతా పోతారు)

## రెండో రంగం: దక్షిణ మైదానం.

(కత్తి తన కోటులోపల దాచుకుంటూ విశ్వం వస్తాడు)

విశ్వం:-కత్తి పైకి కనపడిందంటే గారడీచూడటానికి పోగైనట్టు జనం చేరతారు. ఈ అనుమానం అన్నవేళకురాదేం. మీదు తోడు లేకుండానే పోవాలల్లే ఉంది. చచ్చాం. నాన్నగారొస్తున్నారు. ఎట్లా తప్పించుకోవటం? (తలవంచుకుని తప్పించుకు పోవటానికి చూస్తాడు నిరంకుశం వస్తాడు)

నిరంకుశం:-ఒక్కోసారి నిజంగా ఎంత పొరపడతాం! విశ్వమే అనుకున్నాను, తీరాచూస్తే ఎవరో వన్నెరగని మనిషి. ఆఁహాఁ? వాడే? ఏమిట్రా, విశ్వం? అట్లా బెదురుతావేం? ఒరే, విశ్వం? (సమీపిస్తాడు)

విశ్వం:-క్షమించండి. మీరెవరో నేనెరగను. నాపేరు వినాయకరావు.

నిరంకుశం:- నాదే పొరపాటులెండి! సరిగా చూడక—ఏమ్‌? సరా! ఏదీ? వాడే!—ఆగు, ఆగు—(మొహం పరికించి) అట్లాగేం? వినాయకారావ్వా? ఈ సా రేమిట్రా నీయెత్తు. దొంగవేషమా?

విశ్వం:—నవ్వుల కన్నానండి తమాషాకే! నే నసలు మీకోసమే వస్తున్నాను.

నిరంకుశం:-అట్లాగేం? ఎంత అదృష్టంరా! మొహమూ, మెడా అట్లా కప్పుకున్నావేం? ఎందుకురా?

విశ్వం:-చలిగా ఉంటుందని! ఎట్లాగయినా కొంచెం చలి అనిపిస్తోంది గాదండి? అందులో కాస్త పనికూడా ఉందీ, తిరిగివచ్చేసరి కాలస్యమవుతుందేమోనని!

నిరంకుశం:-నాకోసం వస్తున్నానంటివే? ఎక్కడికి నీ ప్రయాణం?

విశ్వం:-నేనాండి?

నిరంకుశం:-అవును. ఎక్కడికి నీ ప్రయాణం?

విశ్వం:-నా ప్రయాణమాండి?

నిరంకుశం:—మాట పెగల్దేం?

విశ్వం:-నేను-మె-మె-మె-మె— నళిని ని చూడబోతున్నానండి!
అవునండి, నళిన్ని చూడబోతున్నాను. పోయి రాజీపడదామని. మీకోసం ఎందుకు చూస్తున్నానంటే-మె-మె-మె—

నిరం:-నీ వెంట తోడురావటానికి! అవునా? ఇంకేం, పద, పోదాం.

విశ్వం:-కానే కాదండి. అదేంకాదు. చూడండి ఎంత చలిగా ఉందో, మీరు రావటం భావ్యంకాదు.

నిరం:-చలిగా ఎక్కడుంది? లేదే. అయితే నళినితో ఏమంటావో చెప్పు?

విశ్వం:-ఏదో బతిమాల్తాను. ఉషారుచేస్తాను, వాగ్దానాలూ ప్రమాణాలూ చేస్తాను, కాని ఈ చలిలో మీరు నిలబట్టం మంచిదికాదు, అసలే మీ ఆరోగ్యం బాగాలేదు.

నిరంకుశం:-ఏం ఫరవాలేదు. నాకేం తొందరలేదు. నీ వంటి కుర్రాళ్ళ హృదయాలు (విశ్వం రొమ్ము తడువుతూ) ఇదేమిట్రా?

విశ్వం:-ఏం లేదండీ, ఏమీ లేదు.

నిరంకుశం:-ఇదేమిటి? గట్టిగా తగుల్తుంటేనే?

విశ్వం:-నళిని కేదో కానుక్కు-పోతున్నాను.

నిరంకుశం:-ఏదీ, ఏంకొన్నావో చూడనా! (పైబట్ట తీస్తుండగా కత్తి కింద పడుతుంది) నళిని కేదో కానుక్కు-పోతున్నావేం? దాని గొంతు కోసేస్తావా ఏం, ఖర్మం?

విశ్వం:-అహ్హహ్హా! మీకు నవ్వొస్తుందని నాకు తెలుసు. అందుకనే ముందుగా చెప్పుదామనుకోలేదు.

నిరంకుశం:-అట్లాగేం? ఈ నగచూస్తే ఎవరికైనా నవ్వే వస్తుంది!

విశ్వం:అసలు సంగతి చెప్పేస్తున్నాను వినండి. నళిని నన్ను క్షమించదని భీష్మించుకుంటే ఈ కత్తి తీసి గుండెల్లో పొడుచుకుంటానని బెదిరిద్దామనుకున్నాను.

నిరంకుశం:- గడ్డపారతీసుకుని పొడుచుకోవూ? దాందేంబోయిందీ? [illegible] పొడుచుకోమంటుంది. ఏడిచినట్టే, ఉంది. పద!

విశ్వం:- పర్యవసానంమీరే చూస్తారుగా? చూడండి. "నళినీ, ఈ కత్తిపెట్టి గుండెలో పొడుసుకుంటాను," అంటాను,

నిరంకుశం:- "పిచ్చివెధవా, పొడుసుకోరా, పొడుసుకో!" అంటుంది నళిని. పద, పద! నగలట నగలు!

(విశ్వం పోతాడు. సూరన్న పరిగెత్తుకుంటూ వస్తాడు)

సూరన్న:-అపండి దాపండి! చంపేశారు! దొంగద్దొంగలు! ఆపండా పండి! పంతులుగారూ పట్టుకోండి, పట్టుకోండి! చంపేశారు!

నిరంకుశం:-చంపేశిం దెవరు? దొంగ లెక్కడ?

సూరన్న:- ఆయనగారు దాటిపోయినాడు. నేనింక అందలేను. ఎందు కాపలేదండీ, పంతులుగారూ?

నిరం:-నీకేమన్నా మతిపోయిందాయేం? ఎవర్నిరా ఆపేదీ? విశ్వాన్నా?

సూరన్న:-అవునండి. పీకలు తెగిపోతున్నై.

నిరంకుశం:-అదేమిటి?

సూరన్న:-చూసుకోండి, పంతులుగారూ. ఎక్కడ చూసినా హత్యలే! కొట్టాడుకుంటుండారు. కత్తులెట్టి పొడుసుకుంటుండారు!

నిరంకుశం:- ఎవర్రా?

సూరన్న:-ఎవరేమిటండి? అందరూనూ. మాదొరా, కయ్యం పంతులు గారూ, మీ అబ్బాయీ——

నిరం:-దొంగకుంకా! ఇదా వీడియెత్తు? ఇదెక్కడో నీకుతెలుసురా?

సూరన్న:-దూరుపుతోటలోనండి.

నిరంకుశం:-నీకు దారితెలుసా?

సూరన్న:- తెలీదండి మరి. పోలీసినస పికచెరుగార్నీ, మునసబు గార్నీ. చేరమనుగార్నీ అందర్నీ పిలుసుకొస్తానండి, నలుగురూ అడ్డమైనా పడతారేమో!

నిరంకుశం:-ఏదిరా, కాస్త నీచెయ్యి! దొంగవెధవ! వీడిసంగతి నే చెబుతాను. వీడినగలూ వీడూనూ! (ఇద్దరూ పోతారు)

## మూడో రంగం : తూర్పుకోట

(పిస్తోళ్ళు పట్టుకుని కయ్యంపంతులూ, పిచ్చిబాబూ)

పిచ్చిబాబు:-దశ్శరథా, కయ్యంపంతులుగారూ, నలభై అంగలదూరం ఉంటే సరిపోతుందండి.

కయ్యం:-పోట్లాడేది ఫిరంగులతో అనుకున్నావా ఏం? ఈ గొడవంతా నీకు దేనికిలెస్తూ? నే చూస్తాగా! ఇదుగో (అంగలుకొలిచి) ఇంతదూరమైతే చాలా బాగుంటుంది.

పిచ్చి:- ఇంతకన్న ఇద్దరమూ ఒకే ముసుగులో దూరి కాల్చుకుంటే మటుకేం? నామాట వినండి, ఎంతదూరముంటే నేనంత గురిగాకాలుస్తాను.

కయ్యం:- నీ పద్ధతిచూస్తే కనుచూపుమేరలో లేనివాణ్ణి మరింత బాగా గురిచేసేట్టుందే?

పిచ్చిబాబు:_అట్లాకాదు, కయ్యంపంతులుగారూ! నలభై అంగలుగాని, ముప్ఫైఎనిమిదిగాని అయితే-

కయ్యం:-ఛా, ఛా, మీపిస్తోళ్ళ మధ్య మూడు నాలుగంగలుంటే మైలున్నట్టు.

పిచ్చి:-దశ్శరథ! నా పరాక్రమం కాల్చ, అంతదగ్గిరున్నవాణ్ణాచంపటం? లేదండీ కయ్యంపంతులుగారూ వాణ్ణి దూరంనుంచే పడగొట్టనివ్వండి.

కయ్యం:-ఆ విషయం నేనూ, అతని వెంటవచ్చే మనిషీ కలిసితేలుస్తాం. అయితే, పిచ్చిబాబూ, ఏదన్నా దారితప్పి జరిగితే నేను చెయ్యగలదేమైనా ఉందా?

పిచ్చిబాబు:-ఏముందీ? నా కర్థంకాలేదే?

కయ్యం:-మరేంలేదు. తుపాకులతో యుద్ధంగనక గుండుదెబ్బ సరిగా తగిలేపక్షంలో నిన్నానమయంలో శ్రమపెట్టటం దేనికని!

పిచ్చిబాబు:-గురిగానా?

కయ్యం:-అటువంటి దేమైనా జరిగితే నిన్ను మంచంలోపెట్టి ఇంటికి

పంపమన్నావా, ఇక్కడే దహనంకానివ్వమని నీ తాత్పర్యమా. ఇక్కడ చక్కని శ్మశానం ఉందని విన్నాను.

పిచ్చిబాబు:-మంచులో పెట్టటమా? శ్మశానమా అటువంటిమాట లనకండి కయ్యంపంతులుగారూ!...నీపద పడిపావ!

కయ్యం: అయితే ఇటువంటి తగాదా పరిష్కారం నీకిదే కొత్తల్లే కనిపిస్తుంది?

పిచ్చిబాబు:-అవునండి.

కయ్యం:-అయ్యయ్యో! ఇటువంటివి అనుభవం ఉండటం మంచిది. చూడూ, అలను కాల్చేటప్పు డెట్లా నిలబడతావు?

పిచ్చిబాబు:-అదితెలుసుతెండి! ఆమాత్రం ఎరుగుదును. (నిలబడి) ఇట్లా నిలబడతాను. అతనిగుండుకు సాధ్యమైనంత సన్నంగా పక్క వాటంగా నిలబడతాను.

కయ్యం:-చాలా పొరపాటు, చూడు నేను నిన్నిప్పుడు బారుచేస్తాను.
(తుపాకి బారుచేస్తాడు)

పిచ్చిబాబు:-అయ్యో! కాల్చేగలరు!

కయ్యం:-ఏమీ ఫర్వాలేదు,

పిచ్చి:-మీకు తెలీదు. ఒక్కొప్పుడు దానంతటఅదే పేలి ఊరుకుంటుంది.

కయ్యం:-ఛీఛీ, భయపడకు! నేనిప్పుడు కాల్చానంటే నా తుపాకీ గుండు నీ ఎడమపక్క ఉండే మర్మస్థానాలకు తగలకుండా పోయిన పక్షంలో కుడిపక్క ఉండే మర్మస్థానాలకు తప్పక తగుల్తుంది.

పిచ్చిబాబు:-మర్మస్థానమే!

కయ్యం:-అందుకనే ఇట్లా ఎదురుగా నిలబడు (నిలబెట్టి) ఇట్లా నిల బడ్డప్పుడు ఒకటి రెండు గుళ్ళు నీ పొంటోనుంచి దూసుకుపోయినా నీ ప్రాణాని కపాయం కలక్కపోవచ్చును.

పిచ్చిబాబు:-ఒకటి రెండు గుళ్ల దూసుకుపోవటమే!

కయ్యం:-దానికేం? తప్పకుండా దూసుకుపోనీ! పైగా ఇట్లా నిలబడి

తేనే పెద్దమనిషి తరహాగా కూడా ఉంటుంది.

పిచ్చిబాబు:- కయ్యం పంతులుగారూ, చచ్చేవాడికి నాజూకులెందుకు? నేను పక్కగానే నిలడతాను.

కయ్యం:-(గడియారం చూసి) వీళ్ళిక రారా ఏం? లేదు, లేదు, ఆ వొచ్చేది వాళ్ళే అనుకుంటాను.

పిచ్చిబాబు:-ఆఁ? ఏమిటీ? వొస్తున్నారా?

కయ్యం:-అదుగో! ఆవొచ్చేది వాళ్లుకారూ?

పిచ్చిబాబు:-ఆహా! ఇద్దరున్నారే! రానివ్వండి, కయ్యంపంతులుగారూ, మ-మ-మ-మ-మనం, ప-ప-పారి పోవద్దు!

కయ్యం:-పారిపోవడమా?

పిచ్చిబాబు:-వొద్దు, మనం పారిపోవొద్దు!

కయ్యం:-నీకేమైనా మతిపోయిందా ఏం?

పిచ్చిబాబు:-ఏం లేదు. కయ్యంపంతులుగారూ, మరేం లేదు గానీండి. న న న న నాకు ముందున్నంత ధైర్యంగా ఉన్నట్టు లేదేం?

కయ్యం:-పరువు పోయ్యేను, జాగర్త.

పిచ్చిబాబు:-అవు నన్నట్టు, నా పరువుపోరాదు! మధ్యమధ్య-నా-పరువు-సంగతి జ్ఞాపకం చేస్తూందురూ, పుణ్యం ఉంట్టుంది!

కయ్యం:-(చూస్తూ) ఇదుగో వచ్చేశార్లే!

పిచ్చిబాబు:-కయ్యంపంతులుగారూ, మీరు పక్కనుండబట్టి గాని, లేక పోతే నా ధైర్యంపోయి ఉంటే? ధైర్యం వస్తూపోతూ ఉంటుంది.

కయ్యం:-కాస్సేపు పోనీకుండా పట్టుకోమరి.

పిచ్చిబాబు:-ఇదుగో, కయ్యంపంతులుగారూ, నాధైర్యం కాస్తాపోతోం దనిపిస్తోందండీ—అప్పను—పోతోంది. జారిపోతోంది. నా అరిచేతుల్లోంచి కారిపోతున్నట్టనిపిస్తోంది.

కయ్యం:-నీ పరువుమాట మరవకు. ఇదిగో వచ్చేశారు.

పిచ్చిబాబు:-ఇంటిదగ్గిర పడుండక ఇక్కడ కెందుకొచ్చాన్రా, భగవంతుడా! నన్ను వీళ్ళు నాకుతెలిసే లోపల చంపెయ్యగూడదూ?

(అనుమానమూ, విశ్వాయూ వస్తారు)

కయ్యంపంతులు:-దయచెయ్యండి, దయచెయ్యండి. ఏమిటి? కాప్టెన్ విశ్వంగారా? నా మాదిరిగానే తమరు తమమిత్రుని సహాయార్థం వచ్చారనుకుంటాను. ముందు ఈచిక్కు పరిష్కారం అయితే తరవాత మన వ్యవహారం పరిష్కరించుకోవచ్చు.

పిచ్చిబాబు:-ఏంరా, విశ్వం! నువ్వొచ్చావు గద!

విశ్వం:-చూడుబాబు, ఇక్కడున్నది శృంగారం.

కయ్యం:-ఓహో, పిచ్చిబాబూ, ప్రతిపక్షుల్ని మధ్యవర్తి చెయ్యటం చాలా బాగుంది. (అనుమానంతో) అయితే శృంగారంగారూ, మీ రే ఆయుధాలు పడతారో నిర్ణయిస్తే నేనూ విశ్వంగారూ కలిసి మానంకొలుస్తాం.

అనుమానం:-నా కాయుధాలా?

పిచ్చిబాబు:-మంచిమాట చెప్పార్లెండి, కయ్యంపంతులుగారూ. నేను అనుమానంగారితో పోట్లాడను. వీరిద్దరూ నా అత్యంత స్నేహితులు.

కయ్యం:-ఏమండీ, మీరిక్కడి కొచ్చింది పిచ్చిబాబుతో పోట్లాడ్డాని క్కాదూ?

అనుమానం:-ఎంత మాత్రమూ కాదు.

కయ్యం:-ఇదంతా నాకేమీ బాగాలేదు. మీరిలా ఆయుధం పట్టునని భీష్మించుకు్కూచుని మా ముగ్గురి ముచ్చటా పాడుచెయ్యటం భావ్యంకాదు.

విశ్వం:-కయ్యంపంతులుగారి కోసం పోట్లాడరాదట్రా, అనుమానం?

అనుమానం:-ఓ వేళ పిచ్చిబాబుగారి కేమన్నా అంత సరదా ఉంటే-

పిచ్చిబాబు:-ఎబ్బే, ఛీ. ఛీ! నా అవమానాన్ని ఎట్లాగైనా సహిస్తాను గాని! చూడండి, కయ్యంపంతులుగారూ, నాకు పోట్లాడవలసిన అగత్యం ఏమీలేదు. మీ అనుజ్ఞ అయితే నేను విరమిస్తాను.

కయ్యం:-నన్నింత చులకన చెయ్యటం మర్యాదగాలేదు, పిచ్చిబాబూ, ఎవరితోనో పోట్లాడతానని ఇక్కడికొచ్చావు. ఆయనస్థానే ఈ పెద్దమనిషి వచ్చినప్పుడు నువ్వెందుకు వెనకాడాలో నా కర్థంకాకుండా ఉంది.

పిచ్చిబాబు:-అట్లా ఎంతమాత్రమూ కాదు. నేను శృంగారం అనేవాడితో

పోట్లాడదామకున్నాను. వాడు మొహమైన చూపందే! వాడే ఇక్క-డుంటే వాడికి చూపడను నా తడాఖా!

విశ్వం:-ఓబ సాగు, బాబూ, అసలు సంగతి విను. శృంగారమనే మనిషే లేదు. ఆపేరు పెట్టుకున్నవాణ్ణి నేనే. శృంగారం నీకు చేసిన అవమానానికి నేనే జవాబుదారును. నన్నేం చేస్తావో చెప్పు.

కయ్యం:-భేష్! ఇంకేం——?

పిచ్చిబాబు:-ఏమిటండీ మీరు మరీనూ! నేను మా విశ్వంతో ఎక్క-డన్నా పోట్లాడుతానా? యాభై శృంగారాలయితేమటుకు! నన్ను ద్రోహం చెయ్యమంటారా ఏం? బాగుందిలెండి!

కయ్యం:-నీ పరాక్రమం నీళ్ళుగారిపోయింది పో!

పిచ్చిబాబు:-కావలిస్తే మీరు పోట్లాడండి. మీకు మద్దతుగా ఉంటాను. మీకెవక్కడైనా గురిగాతగలటం జరిగితే మిగిలిందంతా నాకు వొదిలెయండి. ఇక్కడి శ్మశానం మాంచి విశాలమైనది. లేదా మంచులో ఊరేసి తమర్ని ఎక్కడికి పంపమనాన్నా పంపగలను, ఎంతో సంతోషంగా!

కయ్యం:-పోదూ, నువ్వొట్టి పిరికిపందవూ!

పిచ్చిబాబు:-నన్ను పిరికిపందంటున్నాడు వింటున్నారా? పిరికిపందనేం?

కయ్యం:-అంటే ఏమంటావోయ్?

పిచ్చిబాబు -అదికాదు, కయ్యంపంతులుగారూ, పిరికిపంద అన్నమాట నవ్వులకంటే నాకేమీ అభ్యంతరంలేదు. అదే నిజంగా అంటేమటుకు——

కయ్యం:-ఆఁ, అంటే?

పిచ్చిబాబు:-మీకు పెద్దమనిషి తరహా తెలీ దనుకుంటాను.

కయ్యం:-ఛీ, నీమాటలు నేను పాటించేదేమిటి?

విశ్వం:-మా బాబును మీరు మద్దత్తు వేసుకోండి. వాడు గొప్పరౌడీ. వారాని కొకణ్ణి పొట్టనపెట్టుకుంటాడు. కాదురా, బాబూ?

పిచ్చిబాబు:-కాకేం? మావూళ్ళో ఎవర్నన్నా అడుగు.

కయ్యంపంతులు:- అయితే, కాప్టెనుగారూ, మనం ఉపక్రమింతాం.

(కత్తి తీస్తూ) బయటికిరావే! ఆ పెద్దమనిషి పర్యావసానా నా ప్రియురాలిని ఏది లేస్తాదో లేదో అడుగు.

విశ్వం:-నీకంత తీటగా ఉంటే, రా! నేను చెబిని సమాధానం చెబుతాను. (కత్తి తీస్తాడు)

(నిరంకుశం పంతులూ, సూరన్నా, స్త్రీలూ వస్తారు)

సూరన్న:-ఒక్కొటున అందర్నీ చాపచుట్టగా చుట్టగొట్టేంతి, పంతులు గారూ, మా దొరని మరింత గట్టిగా కొట్టి పెడరెక్కలు విరిచి బంధించండి.

నిరంకుశం:-చాల్లేరా, అబ్బాయి. చాలించు. ఏమిటీ ద్వంద్వ యుద్ధం!

విశ్వం:-నాకు తెలీదు, ఆ పెద్దమనిషి నడగండి. నన్ను సవాలు చేసిం దాయనే. నేను సైనికోద్యోగిని కూడాను.

నిరం:-ఎవరిగొంతో కొయ్యబోతూ, ఇదేమిట్రా అంటే, సైనికోద్యోగి నంటాడేమిటి? అందుకని ప్రభువుల కత్తితో అందరి గొంతులూ కోస్తావురా?

విశ్వం:చెబుతున్నాను గదండీ? ఆ పెద్దమనిషి అకారణంగా నన్ను సవాలు చేశాడు.

నిరంకుశం:-అకారణంగా మా వాణ్ణేమని సవాలు చేశావయ్యా?

కయ్యం:- అయ్యా, మీ కుర్రవాడు నాకు తీరని అపమానం చేశాడు.

నిరంకుశం:-ఏంరా, విశ్వం? నువ్వా పెద్దమనిషికి తీరని అపమానం ఎందుకు చెయ్యవలి సొచ్చిందీ?

తికమకమ్మ:-ఆడవాళ్ళదగ్గిర మీ మానాలు కట్టిపెట్టండి. ఏమిటిది, విశ్వం? మమ్మల్నెందుకు యుఃఖపెంచావు? చూడు నళిని నిన్ను గురించి ఎంత దిగులుపడిందో.

విశ్వం:-నేను చచ్చిపోతానేమో నన్నా, పోనేమో ననాంది?

కయ్యం:-అమ్మా, ఈ కుర్రదాని తరపున నన్నోమాటక్క చెప్ప నివ్వండి. ఆమె మౌనానికి కారణం నాకు తెలుసును.

నళిని:-మాబాగా చెప్పారు. అందుచేతనే ఈ పెద్దమనిషితో ఇక ఇగడం మానేసి ఆయన సొత్తయిపోతాను.

విశ్వం:-నిజంగానా. నళినీ. అయ్యా, కయ్యంపంతులుగారూ, నేను మీకేదో అపమానంచేశానను కుంటున్నారే. అందులో ఏదో పొరపాటుండి ఉండాలి. నేను బుద్ధిపూర్వకంగా మీకే అవ మానము చేయలేదు బుద్ధి పూర్వకంగా చేసిన అవమానంకోసం నేను పోట్లాడటానికి సంసిద్ధుణ్ణే గనక ఎక్కడ్కా-చేసినదానికి క్షమించండి. కాని ఈమె స్వయంగా నాకు సుముఖురాలయింది గనక ఈవిడకోసం ఎవర్నయినా ఎదిరిస్తాను.

నిరంకుశం:-మంచిమాటన్నావురా, అబ్బీ. నేను నీకు మద్దతున్నాను.

పిచ్చిబాబు:-నాకావిడమీద ఉన్న హక్కులన్నీ వొదిలేస్తాను. పెళ్లాంకోసం ఎవడు పోట్లాడతారు, బాబూ, బతికుంటే బలుసాకు తినొచ్చు.

కయ్యం:- అంతమర్యాదగా చేసిన సవాలు ఆమోదించకపోవటం బాగుండదు. కాప్టెనుగారూ, మీసవాలు నేను స్వీకరిస్తాను (జేబులోనుంచి ఉత్తరాలు తీసి) ఈ ఉత్తరాలు తాను రాసినవని ఈవిడ గుర్తిస్తుందా?

తికమక:-(స్వగతం) అయ్యో, నారహస్యం ఇప్పుడు వ్యతిరిక్తమై పోతుంది! (పైకి) కయ్యంపంతులుగారూ, ఇందులో తిరుగుడు నేను వితరణ చెయ్యగలను—

కయ్యం:-అవ్వా, నువ్వూరుకో. ఇది నీకు సంబంధించిన విషయం కాదు. నళినీ, ఇందులో కలికివి నువ్వవునా కావా?

నళిని:-నేను కానేకాదు. (విశ్వంతో కలసి పక్కకిపోయింది)

తికమకమ్మ:-కయ్యం పంతులుగారూ, మీ కృతఘ్నత కేమనేది? ఆ కలికిని నేనే! నాదే ఆ ప్రణయ పరిహారం.

కయ్యం:-నువ్వా, కలికివి? చాల్లే!

తికమకమ్మ:-ఎక్కడో మైరావణుడల్లే ఉన్నాదే! ఆ ఉత్తరాలు నావే. నన్ను క్షమాపణవేడితే గాని నిన్ను దగ్గరకే రానివ్వను, పో!

కయ్యం:-తికమకమ్మగారూ, మీ అనుగ్రహానికి ధన్యుణ్ణి. నన్ను మీరే మోసగించారో, ఆ లచ్చిముండే మోసగించిందో తెలీకుండా ఉంది. ఎట్లా అయినా మీయిద్దరికీ కృతజ్ఞుణ్ణే! ఇదుగో. విశ్వంగారూ, నా కృతజ్ఞతను మన్నించి మీరే ఈ ముసిలిదాన్ని కూడా పుచ్చుకోండి.

విశ్వం:-కావలిస్తే ఇక్కడ మాబాబున్నాడు, భార్య కావలసినవాడు.

పిచ్చిబాబు:-వొద్దురా నాయనా, మునలివాసన : కాని, కయ్యంపంతులు గారూ, ఈసారి నన్ను మంచుగడ్డలో పెట్టటానికి మీకు అవకాశం ఇస్తినా నన్ను మరోపేరుతో పిలవండి.

నిరం:-రావమ్మా, తికమకమ్మా. నువ్వవ్వాపే ముసలివాని పె...

తికమకమ్మ:-చాల్లెద్దురూ, నిరంకుశం పంతులుగారూ, మీమొగాళ్ళంతా ఒకటే మచ్చూ! (రజనీ, అనుమానం తప్ప ...అంతా పోతారు)

రజని:-పాపం, మోహం ఇంతచేసుకునీ ఉన్నాడు—కాని అంత మాత్రంలేదు. ఆయన చెప్పిన కథ బొత్తిగా కల్పనకాదన్నమాట! సరియైన నిర్ణయంచేసుకోని దానికి దృఢసంకల్పం ఎక్కణ్ణుంచి వస్తుందీ?

అనుమానం:-రజనీ, ఏమనేటందుకూ అర్హతలేకుండా చేసుకున్నాను. కాని ఆశమాత్రం విడవకుండా ఉంది.

రజని:-మీరు తెప్పించిన కోపం నిలబెట్టుకోలేకుండా ఉన్నందుకు నే నేమనుకోను? ఏప్రేమకొద్దీ మీలో దౌర్బల్యం కలిగిందో నాలోకూడా అప్రేమే బలంలేకుండా చేస్తున్నది.

అనుమానం:-బతికించావు, రజనీ! (నిరంకుశం పంతులు వస్తాడు)

నిరం:-ఏంచేస్తున్నార్రా, ఇక్కడా? మీరుకూడా కొంపతీసి పోట్లాడు కోవటం లేదుకద? ఇదివరకల్లా చూస్తూ ఊరుకున్నానుగాని ఇకడుకుంకోను. ఏమిటి, రజనీ? అతన్ని పెళ్ళాడిచూడు, మనిషి ఎంత మారిపోతాడో!

(మిగిలినవారు కూడా వస్తారు)

కయ్యం:-ఇక్కడ అందరి కోరికలూ నెరవేరి తృప్తిఅయిందను కుంటాను. నా కోరిక నెరవేరకపోయినా అందర్నీచూసి నాకూ తృప్తి గానే ఉంది.

పిచ్చిబాబు:-బాగా చెప్పారు, కయ్యం పంతులుగారు. మీకందరికీ నేను విందు ఏర్పాటుచేస్తున్నాను, బాజాభజంత్రీలతో సహా.

నిరంకుశం:-అదీ మాట!

తెర

Printed at the B. N. K. Press, Madras—Q. H. No. MS. ...
For Q. H. No. 401. Oal. D. 750 Copies—December 1946.

YUVA ...
PUBLICATION

PRANATA RO.
by SHERIDAN